# శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము

## ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషాలతో

ఆచార్యతాడేపల్లి పతంజలి



ఆనందసాగర స్తవం అనేది శ్రీ ఆదిశంకరాచార్యులచే రచించబడిన ఒక భక్తి స్తోత్రం, ఇది మీనాక్షీ దేవిని స్తుతిస్తుంది. ఈ స్తవం ఆమె దివ్య సౌందర్యం, అనంతమైన దయ మరియు విశ్వంపై ఆమె యొక్క సర్వోన్నత శక్తిని కీర్తిస్తుంది, ఆమెను ఆనందం మరియు మోక్షం యొక్క సాగరం (సముద్రం) గా అభివర్ణిస్తుంది.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము

శ్లోకం 1

విజ్ఞాపనార్హ్వా విరలావసరానవాప్త్య

మందోద్యమే మయి దవీయసి విశ్వమాతుః

అవ్యాజభూత కరుణా పవనా పవిద్ధా-

న్యంతః స్మరామ్యహ మపాంగ తరంగితాని

ప్రతి పదార్థము

విజ్ఞాపన + అర్హ్వా — వినతికి అర్హ్వమైన, విరల — సడలిన, అవసరాన్ + అవాప్త్య — అవసరములను పొందిన, మంద + ఉద్యమే — మూర్ఖుని ప్రయత్నమునందు, మయి — నాయందు, దవీయసి — బాగా దూరంగా ఉన్న, విశ్వమాతుః — ప్రపంచమాత అయిన మీనాక్షి యొక్క, అవ్యాజభూత — కపటము లేనిది, అకృత్రిమమైనది, సుందరమైనది, కరుణా పవన + అపవిద్ధాని — దయ అనెడి గాలితో త్రోయబడిన, అపాంగ తరంగితాని — కన్ను కొన భాగపు కెరటములను, అహం — నేను, అంతః — నా మనస్సులో, స్మరామి — స్మరించుచున్నాను.

తాత్పర్యము

నేను మీనాక్షీదేవి చూపుల తరంగాలను నా మనస్సులో స్మరిస్తున్నాను. ఆ చూపుల తరంగాలు కపటములేని సుందరమైన దయ అనెడి గాలితో త్రోయబడినవి. ఆమె ముందు నా దుస్థితిని విన్నవించుకునే అవకాశం లభించింది. కానీ నేను ఆమెకి చాలా దూరంలో నిదానంగా నిరుత్సాహంగా నిలబడి ఉన్నాను.

---

శ్లోకం 2

ఆవేద్యతా మవిదితం కిమథాప్యనుక్తం

వక్తవ్య మాంతర రుజోపశమాయ నాలం

**ఇత్యర్థ్యసే కిమపి తచ్ఛవణే నిధాతుం**

**మాతః ప్రసీద మలయధ్వజ పాండ్యకన్యే**

**ప్రతి పదార్థము**

**అవిదితం – తెలియనిది, ఆవేద్యతామ్ – తెలుపదగినది, కిమ్ – ఏమున్నది?, అథ + అపి – అయినప్పటికీ, అనుక్తం – చెప్పబడినది, వక్తవ్యమ్ – చెప్పదగి ఉన్నది, న + అలం – మనస్సులోని బాధ మానదు, ఆంతర రుజ + ఉపశమాయ – లోపల ఉన్న అవమానపు బాధను తగ్గించుటకు, కిమ్ + అపి – ఇంకనూ, ఇతి – అని, తత్ + శ్రవణే నిధాతుం – నా బాధను వినుటకు, అర్థ్యసే – నాచే అర్థింపబడుచున్నావు, మాతః – తల్లీ!, మలయధ్వజ పాండ్య కన్యే – మలయధ్వజ పాండ్యకుమారితా! మీనాక్షీ!, ప్రసీద – రక్షింపుము.**

**తాత్పర్యము**

**మలయధ్వజ పాండ్య కుమారితా, నా తల్లి! సర్వజ్ఞురాలివైన నీకు ఇదివరలో తెలియనిది నేను కొత్తగా ఎలా చెప్పగలను? కానీ అత్యవసరమైన ఆలోచనల ప్రవాహం నాలో బలవంతంగా కొనసాగుతున్నది. ఆ ప్రవాహాన్ని మూసివేస్తే నేను అవసరమైన మనశ్శాంతిని కోల్పోతాను. కాబట్టి నేను చెప్పే మాటలు వినడానికి నేను మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాను.**

---

**శ్లోకం 3**

**ఆక్రందితం రుదిత మాహత మాననేవా**

**కస్యార్ద్ర మస్తు హృదయం కిమతః ఫలంవా**

**యస్యా మనో ద్రవతి యా జగతాం స్వతంత్రా**

**తస్యా స్తవాంబ పురతః కథయామి ఖేదం**

**ప్రతి పదార్థము**

**అంబ – తల్లీ!, ఆక్రందితం – మరొకరి ముందు నేను గద్గదంగా ఏడ్చినా, రుదితమ్ – జాలిగా విలపించినా, ఆననే ఆహతమ్ + వా – నిరాశతో మొగం మీద కొట్టుకొన్నా, కస్య – ఎవనికి, హృదయం ఆర్ద్రమ్ + అస్తు – హృదయం కరుగుతుంది?, అతః కిమ్ వా ఫలం – ఒకవేళ అతను జాలిపడినప్పటికీ, తరువాత వచ్చే పూర్ణ ఫలితం ఏముంటుంది?, యస్యాః – ఎవరి యొక్క, మనః – మనస్సు, ద్రవతి – కరిగిపోతుందో, యా – ఎవరు, జగతాం – ప్రపంచంలో, స్వతంత్రా – స్వతంత్రురాలో, తస్యాః + తవ – అటువంటి దేవియొక్క నీయొక్క, పురతః – ముందు, ఖేదం కథయామి – దుఃఖాన్ని చెబుతాను.**

**తాత్పర్యము**

తల్లీ! మరొకరి ముందు నేను గద్గదంగా ఏడ్చినా, జాలిగా విలపించినా, నిరాశతో మొగం మీద కొట్టుకొన్నా, ఆ మరొకడు నాపై జాలితో కరిగిపోతాడా? ఒకవేళ అతను జాలిపడినప్పటికీ, అతను నాకు ఏమైనా పూర్ణ సహాయం చేయగలడా? కాబట్టి ప్రపంచ పరిపాలకురాలివైన మరియు కరుణామూర్తివైన నీ సమక్షంలో నా దుఃఖాన్ని వెదజల్లాలని కోరుకుంటున్నాను.

---

శ్లోకం 4

పర్యాకులే మనసి వాచి పరిస్ఖలంత్యాం

ఆవర్త గర్త ఇవ చక్షుషి ఘూర్ణమానే

కస్తేఽభిదాస్యతి శివే మమ తామవస్థాం

కాలే దయస్వ కథయామి తవాధునైవ

ప్రతి పదార్థము

శివే – ఓ శివుని సతీమణీ!, మనసి పరి + ఆకులే – నా మనస్సు చాలా కలత చెందినప్పుడు, వాచి పరిస్ఖలంత్యాం – నాలుక తడబడినప్పుడు, చక్షుషి ఆవర్త గర్త ఇవ ఘూర్ణమానే – సుడిగుండంలో చిక్కుకున్నట్లు కళ్ళు తిరుగుతున్నప్పుడు, తాం మమ అవస్థాం – అప్పటి నాయొక్క పరిస్థితిని, తే కః అభిదాస్యతి – నీకు ఎవరు వర్ణించగలరు?, కాలే అధునా + ఏవ – (అందుకే) నేను ఇప్పుడే, తవ కథయామి – నీకు విన్నవిస్తాను, దయస్వ – దయతో వినవలసినది.

తాత్పర్యము

ఓ శివుని సతీమణీ! (జీవితం యొక్క ముగింపు క్షణాలలో) నా మనస్సు చాలా కలత చెందినప్పుడు, నాలుక తడబడినప్పుడు, మరియు సుడిగుండంలో చిక్కుకున్నట్లు కళ్ళు తిరుగుతున్నప్పుడు, నా పరిస్థితిని నీకు ఎవరు వర్ణించగలరు? అందుకే నేను నీకు ఇప్పుడే విన్నవిస్తాను. దయతో వినవలసినది.

---

శ్లోకం 5

భక్తిం కరోతు నితరాం సురజాతిమాత్రే

గ్రామీణ జంతురివ పౌరజనేషు లోకః

అన్యత్ర దేవి భవదీయ పదారవిందా-

దాకృష్యమాణమపి మే హృదయం నయాతి

**ప్రతి పదార్థము**

**దేవి – ఓ మీనాక్షీ దేవి!, లోకః – లోకములోని, గ్రామీణ జంతుః – గ్రామీణులు, పౌరజనేషు ఇవ – పట్టణ ప్రజల జీవన విధానం పట్ల ఉత్సాహం చూపించినట్లుగా, సురజాతిమాత్రే – దేవతలనెడి నక్షత్రవీథిలో, నితరాం భక్తిం కరోతు – ఎప్పుడు భక్తిని ప్రకటించి తమను తాము ఉత్సాహంతో నింపుకోవచ్చుగాక; (కింతు – కాని) భవదీయ పదారవిందాత్ – నీ పాదపద్మాలనుండి, అన్యత్ర – వేరొకచోటికి, మే హృదయం – నా హృదయాన్ని, ఆకృష్యమాణమపి – బలవంతంగా కూడా, నయాతి – దూరంచేయలేను.**

**తాత్పర్యము**

**ఓ దేవీ! పేద గ్రామీణ ప్రజలు, పట్టణ ప్రజల జీవన విధానం పట్ల ఉత్సాహం చూపించినట్లుగా, లోకంలోని కొంతమంది భక్తులు నక్షత్రవీథిలోని నక్షత్రాల వలె ఉన్న ఇతర దేవతల పట్ల తమ భక్తిని ప్రకటించి తమను తాము ఉత్సాహంతో నింపుకోవచ్చు; కానీ నా హృదయాన్ని బలవంతంగా కూడా నీ పాదపద్మాలనుండి నేను దూరం చేయలేను.**

---

**శ్లోకం 6**

**అంగీకురు త్వమవధీరయ వా వయం తు**

**దాసా స్తవేతి వచసైవ జయేమ లోకాన్**

**ఏతావతైవ సుకరో నను విశ్వమాతః**

**ఉద్దండ దండధర కింకర మౌళిభంగః**

**ప్రతి పదార్థము**

**విశ్వమాతః – ఓ విశ్వమాతా! మధుర మీనాక్షీ!, త్వమ్ అంగీకురు – నువ్వు నేను చెప్పినమాట అంగీకరించినా, అవధీరయ వా – లేదా తిరస్కరించినా, వయం తు – మేము, తవ దాసాః – నీకు మాత్రమే దాసులము, ఇతి వచసా + ఏవ – అను ఈ మాటలతో, లోకాన్ – లోకాలను, జయేమ – జయిస్తాము, ఏతావతా + ఏవ – ఇది మాత్రమే (ఈ మాట మాత్రమే), ఉద్దండ దండధర కింకర మౌళి భంగః – భయంకరమైన యమ కింకరుల కిరీట భంగము చేసే కార్యక్రమాన్ని, సుకరః నను – సులభం చేస్తుంది కదా!**

**తాత్పర్యము**

**నువ్వు నన్ను అంగీకరించినా లేదా తిరస్కరించినా, మేము నీకు మాత్రమే దాసులము. ఈ మాటతో లోకాలను మేము జయిస్తాము. ఈ మాట మాత్రమే (అమ్మవారి దాసులమనే మాట) భయంకరమైన యమ కింకరుల కిరీట భంగము చేసే కార్యక్రమాన్ని సులభం చేస్తుంది కదా! (అనగా అమ్మవారి దాసులను యమ కింకరులు ఏమీ చేయలేరని కవి హృదయం).**

---

**శ్లోకం 7**

**వేదాంత వాక్యజనితం విమలం విచారైః**

**ఆసాద్య బోధ మనుచింతనతోఽపరోక్షం**

**ముక్తిం వ్రజంతి మనుజా ఇతి సూక్తి మాద్యా-**

**మాలంబ్య కస్తరితు మర్హతి శైలకన్యే**

**ప్రతి పదార్థము**

**శైలకన్యే – హిమవంతుని పుత్రికా!, వేదాంత వాక్యజనితం – వేదాంత వాక్యమునుండి పుట్టిన, విచారైః – ఆలోచనములతో (వ్యాఖ్యలతో), విమలం – స్వచ్ఛమైన, అనుచింతనతః – అధ్యయనం ద్వారా, (ఎడతెగని చింతతో) అపరోక్షం బోధమ్ – స్వానుభవంతో సంపాదించుకున్న బ్రహ్మజ్ఞానమును (ఇతరులనుంచి తెలుసుకున్న జ్ఞానం పరోక్షజ్ఞానం), ఆసాద్య – పొంది, మనుజాః – మానవులు, ముక్తిం – మోక్షమును, వ్రజంతి – పొందుచుందురు, ఇతి – అని చెప్పబడిన, ఆద్యాం సూక్తిమ్ – మొదటి (శాశ్వతమైన) సూక్తిని, ఆలంబ్య – ఆశ్రయించి, కః – ఎవడు, తరితుమ్ – తరించుటకు, అర్హతి – అర్హత పొందును?**

**తాత్పర్యము**

**హిమవంతుని పుత్రికా! వేదాంత అధ్యయనం ద్వారా, నిశితమైన విచారణ ద్వారా, లోతైన చింతనతో స్వానుభవంతో సంపాదించుకున్న బ్రహ్మజ్ఞానం ద్వారా మానవులు మోక్షాన్ని పొందుతారని వెల్లడించిన ప్రకటనపై ఆధారపడి, ఎవరైనా కష్టాలను అధిగమించగలరా? (అమ్మవారి దయ ఒక్కటే కష్టాలను అధిగమించటానికి సాయపడుతుందని భావం).**

---

**శ్లోకం 8**

**ఏకైక వేద విషయః కతినామ శాఖా-**

**స్తాసాం శిరాంసి కతినామ పృథగ్విధాని**

**అర్థావబోధ విధురోఽక్షరలాభ ఏవ**

**కేషాం నృణాం కతిభిరస్తు శరీరబంధైః**

**ప్రతి పదార్థము**

ఏకైక – ఒక్కొక్క, వేద విషయః శాఖాః – వేదవిషయకమైన శాఖలు, కతి నామ? – ఎన్ని ఉన్నాయి?, తాసాం – ఆ వేద శాఖలకు సంబంధించి ఒక్కొక్కదానికి, పృథక్ + విధాని – ప్రత్యేకంగా చెప్పబడిన, శిరాంసి – ఉపనిషత్తులు, కతి నామ – ఎన్ని ఉన్నాయి? (ఎన్నో ఉన్నాయని భావం) అర్థ + అవబోధ విధురః – వాటి అర్థము బుద్ధికి తట్టి భారము తొలగిపోయినవారు, అక్షర లాభః ఏవ – అక్షరాలను సంక్షిప్తీకరించి జీర్ణము చేసుకొను లాభము కలిగిన, కేషాం నృణాం – ఎంతమంది మానవులకు, కతిభిః శరీర బంధైః – ఎన్ని రకాల జన్మలు, అస్తు – ఉన్నాయి.

తాత్పర్యము

వేదాలు నాలుగు. అందులో ప్రతి వేదానికి అనేక శాఖలు ఉన్నాయి. ప్రతి శాఖకు ప్రత్యేక ఉపనిషత్తులు ఉన్నాయి. వీటన్నింటికి అర్థం తెలియక కేవలం అధ్యయనం చేయడానికే ఎన్నో జన్మలు పడుతుంది. (కనుక శీఘ్రానుగ్రహం కోసం అమ్మవారిపై భక్తితో శరణు కోరుతున్నానని కవి హృదయం).

---

శ్లోకం 9

న్యాయాః పరస్పర విభిన దిశః సహస్ర-

ముచ్చావచాని చ భవంత్యుపబృంహణాని

ఏవం స్థితే గిరిసుతే నిగమోపలానాం

తాత్పర్య సార మవధారయితుం క్షమః కః

ప్రతి పదార్థము

గిరిసుతే – పర్వత పుత్రికా!, పరస్పర విభిన దిశః – పరస్పరము విరుద్ధమైన, న్యాయాః – వస్తువివేకమును దేనితో పొందుతారో దానిని న్యాయశాస్త్రము అంటారు. అటువంటి వేదముతో సంబంధము కలిగిన న్యాయశాస్త్రాలు, సహస్రమ్ – అనేకము (ఉన్నాయి), ఉపబృంహణాని – వాటిని చక్కగా పెంచిన వ్యాఖ్యానాలు, ఉచ్చావచాని చ – బహుప్రకారము కలవిగా (అనేకరకాలుగా), భవంతి – ఉన్నాయి, ఏవం స్థితే – ఇటువంటి స్థితిలో, నిగమ + ఉపలానాం – వేదరత్నాలయొక్క, తాత్పర్య సారమ్ – ముఖ్యమైన ఉద్దేశ్యాన్ని, అవధారయితుం – నిశ్చయంగా తెలుసుకోవటానికి, కః – ఎవడు, క్షమః – సమర్థుడు?

తాత్పర్యము

ఓ పర్వత పుత్రికా! పార్వతీ! న్యాయశాస్త్రాలు చాలా ఉన్నాయి. అందులో ఒకరు చెప్పేది ఒకరు చెప్పరు. ఆ మహర్షుల ఉపదేశాలను వివరించే వ్యాఖ్యాన గ్రంథాలు కుప్పలు కుప్పలుగా అనేకమున్నాయి. ఈ పరిస్థితిలో, వేదాలయొక్క నిజమైన అర్థం ఎలా తెలుసుకోవాలి? ఏది ఆచరించాలి? ఈ వేద ముఖ్యమైన ఉద్దేశ్యాన్ని నిర్ధారించడానికి ఎవరు సమర్థులు?

---

**శ్లోకం 10**

**అస్త్వక్షర గ్రహ విధి ర్జనుషాం సహస్రై-**

**రాపాతతో భవతు వాఽపితతోఽర్థ బోధః**

**దుర్వాది కల్పిత వికల్ప తరంగ సాంద్రాన్**

**దుష్పూర్వ పక్ష జలధీన్ కథ ముత్తరేయుః**

**ప్రతి పదార్థము**

**సహస్రైః జనుషాం — వేల జన్మలలో, అక్షర గ్రహ విధిః — వేదాక్షర జ్ఞానాభ్యాసకుడై, అస్తు — ఉండుగాక, తతః — అటుపిమ్మట (అతనికి) అర్థ బోధః అపి — శబ్దార్థ జ్ఞానముకూడా, ఆపాతతః — తత్క్షణమే స్ఫురించునట్లు, భవతు — ఉండుగాక!, వా — కాని, దుర్వాది — దుష్ట ప్రత్యర్థులచే, కల్పిత — సత్యానికి వ్యతిరేకంగా కల్పింపబడిన, వికల్ప తరంగ సాంద్రాన్ — నిష్క్రియ వివాదాల ఉప్పెనలను, దుష్పూర్వ పక్ష జలధీన్ — అగమ్యగోచరమైన వికృత తాత్విక సిద్ధాంతాల మహాసముద్రాలను, కథమ్ — ఎట్లు, ఉత్తరేయుః — దాటగలడు?**

**తాత్పర్యము**

**వేల జన్మలలో ఎవరో ఒకడు వేదాక్షర జ్ఞానాభ్యాసకుడై ఉండుగాక, అటుపిమ్మట అతనికి శబ్దార్థ జ్ఞానముకూడా తత్క్షణమే స్ఫురించునట్లు ఉండుగాక! కాని అప్పుడు కూడా దుష్ట ప్రత్యర్థులు — సత్యానికి వ్యతిరేకంగా లేవనెత్తిన నిష్క్రియా వివాదాల ఉప్పెనలతో అగమ్యగోచరమైన వికృత తాత్విక సిద్ధాంతాల మహాసముద్రాలను అతడు ఎలా ఎదుర్కొంటాడు? (దాటలేడని, వితండవాదాలు అధిగమించాలంటే అమ్మవారి అనుగ్రహం కావాలని కవి హృదయం).**

---

**శ్లోకం 11**

**బ్రహ్మేతి శక్తిరితి బంధ విమోచనీతి**

**మాయామయీతి మదనాంతక వల్లభేతి**

**సప్తాష్ట శబ్ద పరివర్తనమాత్ర ఏవ**

**సామర్థ్య మావహతి శాస్త్ర పరిశ్రమోఽయం**

**ప్రతి పదార్థము**

బ్రహ్మ + ఇతి — (బ్రహ్మణః ఇయం) సరస్వతి అని, శక్తిః + ఇతి — ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి అని, బంధ విమోచనీ + ఇతి — బంధములనుండి విడిపించు దుర్గ అని, మాయామయీ + ఇతి — మాయతో కూడుకొన్న లలిత అని, మదన + అంతక వల్లభా + ఇతి — మదనుని చంపిన శివుని భార్య పార్వతి అని, సప్త + అష్ట శబ్ద పరివర్తన మాత్ర ఏవ — ఇలా ముఖ్యమైన ఏడెనిమిది పదాలను పదేపదే పలకడం వలన, అయం — ఈ, శాస్త్ర పరిశ్రమః — శాస్త్ర పరిశ్రమకు సంబంధించిన, సామర్థ్యమ్ — సామర్థ్యము, ఆవహతి — కలుగుచున్నది. (ప్రతిభను సృష్టిస్తుంది).

**తాత్పర్యము**

శాస్త్ర పాండిత్యం ఉన్నా, బ్రహ్మ, శక్తి, బంధవిమోచనీ, మాయామయీ అను వాటి గురించి మాట్లాడితే తప్ప (అనగా బాగా విచికిత్స చేస్తే తప్ప) ముక్తికి కారణమైన నిజమైన జ్ఞానం అనుభవంలో తలెత్తదు.

---

**శ్లోకం 12**

తస్మై ప్రసీదసి గిరీంద్ర సుతే య ఇత్థం

సంపాదయేత శనకై రపరోక్ష బోధం

యస్మై ప్రసీదసి సచ క్షమతేఽవబోద్ధు-

మిత్థం పరస్పర సమాశ్రయ మేత దాస్తే

**ప్రతి పదార్థము**

గిరి + ఇంద్ర సుతే — హిమాలయ పుత్రీ! పార్వతీ!, ఇత్థం — ఈ మాదిరి, యః — ఎవడు, శనకైః — మెల్లగా, అపరోక్ష బోధం — స్వానుభవంతో సంపాదించుకున్న బ్రహ్మజ్ఞానం (ఇతరులనుంచి తెలుసుకున్న జ్ఞానం పరోక్ష జ్ఞానం), సంపాదయేత — సంపాదించుకొన్నాడో, తస్మై — అతనిని, ప్రసీదసి — నువ్వు దయతో రక్షిస్తావు, యస్మై — ఎవనిని, ప్రసీదసి — రక్షిస్తావో, సచ — అతడు కూడా, అవబోద్ధుం — వివేకమునకు, క్షమతే — అర్హుడగుచున్నాడు, ఏతత్ — ఇది, ఇత్థం — ఇట్లు, పరస్పర సమాశ్రయమ్ — పరస్పర ఆశ్రయముతో, ఆస్తే — ఉన్నవి.

**తాత్పర్యము**

హిమాలయ పర్వత పుత్రికా! పార్వతీ! నిరంతర ప్రయత్నం ద్వారా ఆత్మజ్ఞానాన్ని పొందేవారిని నువ్వు దయతో రక్షిస్తావు. నీ దయ లేకుండా ఎవరూ ఆత్మజ్ఞానాన్ని పొందలేరు. ఈ రెండూ పరస్పర ఆధారత్వం కలిగినవి. (బ్రహ్మజ్ఞానం సంపాదించుకొన్నవాడిని అమ్మ రక్షిస్తుంది. అమ్మ రక్షిస్తేనే బ్రహ్మజ్ఞానం కలుగుతుందని చమత్కారం).

---

**శ్లోకం 13**

ఆకర్ణయ త్వమిమ మభ్యుపగమ్య వాదం

జానాతు కోఽపి యది వా హృదయం శ్రుతీనాం

తస్యాప్య సంఖ్య భవ బంధ శతార్జితోఽయం

ద్వైతభ్రమో గలతు జన్మ శతైః కియద్భిః

ప్రతి పదార్థము

ఇమమ్ — ఈ, అభ్యుపగమ్య వాదం — ఒక విషయాన్ని చెప్పినపుడు వెంటనే మరో విషయం కూడా అవగతమైనట్లు చెప్పే వాదాన్ని, త్వమ్ — నువ్వు, ఆకర్ణయ — వినవలసినది, శ్రుతీనాం హృదయం — వేదములయొక్క అభిప్రాయాన్ని, కః + అపి — ఎవడయిన, యది వా జానాతు — ఒకవేళ నేర్చుకొన్నారనే అనుకొందాం, తస్య + అపి — అతనికి కూడా, అసంఖ్య భవ బంధ శత + ఆర్జితః — కోట్లాది జన్మల తరబడి సంపాదించిన, అయం ద్వైత భ్రమః — ఈ ద్వైత భ్రమ, కియద్భిః జన్మ శతైః — ఎన్ని వందల జన్మలు గడిస్తే, గలతు — మింగివేయబడుతుంది? (దూరం చేయబడుతుంది?).

తాత్పర్యము

అమ్మా! పార్వతీ! విను. వేదాలకు సంబంధించిన సందేశాన్ని ఖచ్చితంగా అర్థం చేసుకోవడంలో ఎవరైనా విజయం సాధిస్తారనే అనుకొందాం. ఈ సందర్భంలో కూడా, కోట్ల జన్మలనుంచి అతనిని అంటిపెట్టుకొని ఉన్న ద్వైతభ్రమను కడిగివేయడం అసంభవం.

---

శ్లోకం 14

కాలే మహత్య నవధావ పతన్ కదాపి

క్వాప్యంతిమే జనుషి కోఽపి గతిం లభేత

ఇత్థం సమర్థన విధిః పరమాగమానాం

పర్యాయ సూక్తి విధయానయనం నఞర్థే

ప్రతి పదార్థము

మహతి అనవధౌ కాలే — అపరిమితమైన కాలములో, కదాపి — ఒకానొక సమయంలో, అపతన్ — పడిపోకుండా జాగ్రత్తలు తీసుకుంటే, (ఎల్లప్పుడూ ఉన్నత స్థితికి చేరుకోవడానికి కృషి చేస్తే) అన్తిమే క్వాపి జనుషి — దాదాపుగా అంతరాయం లేని జన్మల శ్రేణిలో చివరిలో, కః + అపి — ఎవరైనా, గతిం లభేత — మోక్షానందాన్ని పొందుతారని చెప్పబడింది. (కింతు — కాని) ఇత్థం — ఈ విధంగా, ఆగమానాం — వేదములలో చెప్పబడిన, సమర్థన విధిః — ఆనంద సమర్థన విధి, పరం —

నిజానికి, పర్యాయ సూక్తి విధయా – మరో మాటలో చెప్పాలంటే, నఞర్థే – కాదు అనే అర్థంలో, నయనం – పొందబడినది.

**తాత్పర్యము**

అమ్మా! పార్వతీదేవి! ఈ అపరిమితమైన కాలములో, ఎల్లప్పుడూ ఉన్నత స్థితికి చేరుకోవడానికి కృషి చేస్తే అనేక జన్మల తరువాత ఎవరైనా మోక్షానందాన్ని పొందుతారని శాస్త్రాలలో చెప్పబడింది. నిజానికి నీ అనుగ్రహం లేకపోతే ఈ విధంగా వేదములలో చెప్పబడిన మాట ''కాదు'' అనే అర్థాన్ని పొందుతుంది. (అనగా అమ్మవారి అనుగ్రహం లేకపోతే మోక్షానందం రాదని కవి హృదయం).

---

**శ్లోకం 15**

**ఏకాపవర్గ సమయే జగతోఽపవర్గః**

**సర్వాపవర్గ సమయే పునరస్త శంకః**

**ఈదృగ్విధం కమపి పక్ష మిహావలంబ్య**

**స్థాతుం సుఖం క్షమ మనేన పథా ప్రవృత్తైః**

**ప్రతి పదార్థము**

ఏక + అపవర్గ సమయే – ఒక ఆత్మ మోక్షాన్ని పొందే సమయంలో, జగతః – ప్రపంచము మొత్తానికి, అపవర్గః – మోక్షము కలుగుతుంది, సర్వాపవర్గ సమయే పునః – మరలా సమస్త ప్రాణులకు మోక్షము సంభవించిన కాలములో, అస్త శంకః – నిస్సందేహంగా ఇదే జరుగుతుంది, ఈదృగ్విధం – ఈ విధంగా, ఇహ – ఈ లోకంలో, కమపి పక్షమ్ – ఏదో విధమయిన పక్షాన్ని, అవలంబ్య – అవలంబించి, అనేన పథా – ఈ రకమయిన మార్గములో ఉన్న, ప్రవృత్తైః – ప్రవృత్తి కలవారిచేత, సుఖం స్థాతుం క్షమమ్ – సుఖంగా ఉండుటకు వీలున్నది.

**తాత్పర్యము**

నిర్ణీత కాలంలో శాశ్వతమైన ఆనందము కొరకు దేవుడు అన్ని జీవులకు ఒకేసారి మోక్షమిస్తాడని లేదా ఒక సాధారణ భక్తుడు మోక్ష మార్గగామియైనప్పుడు మొత్తం విశ్వం మోక్షాన్ని పొందుతుందని నమ్ముతారు. తమను తాము ఈ నమ్మకానికి (ద్వైత సిద్ధాంతానికి) కట్టుబడి ఉన్నవారు అలాంటి కొన్ని సిద్ధాంతాలను విశ్వసిస్తూ ఈ లోకంలో విశ్రాంతి తీసుకోవచ్చు.

---

**శ్లోకం 16**

**అభ్యస్య వేద మవధార్య చ పూర్వతంత్ర-**

మాలక్ష్య శిష్ట చరితాని పృథగ్విధాని

అధ్యాపనాదిభి రవాప్య ధనంచ భూరి

కర్మాణి మాత రలసాః కథ మాచరేయుః

ప్రతి పదార్థము

మాతః – ఓ పార్వతీదేవి!, వేదమ్ – వేదమును, అభ్యస్య – అభ్యసించి, పూర్వతంత్రమ్ అవధార్య – పూర్వ మీమాంస శాస్త్రాన్ని నిశ్చయించుటకు (యోగ్యమైనది) తగినదిగా భావించి, పృథక్ + విధాని – వేరు వేరు విధములుగా ఉన్న, శిష్ట చరితాని – విశిష్టుల చరిత్రములను, ఆలక్ష్య చ – పరిశీలించి, అధ్యాపన + ఆదిభిః – వేదము జదివించుట మొదలయిన విధానాల ద్వారా, భూరి ధనంచ – అధికమైన ధనమును, అవాప్య – పొందినప్పటికీ, అలసాః – సోమరులు అవుతారు. (చురుకుదనము లేనివారవుతారు) కర్మాణి – కర్మలను, కథమ్ – ఎట్లు, ఆచరేయుః – అచరిస్తారు?

తాత్పర్యము

పార్వతీదేవి! వేదాలను చదివి, నిశితంగా మీమాంస శాస్త్రాన్ని పరిశీలించి, విశిష్టులయొక్క పరస్పర విరుద్ధమైన పూర్వాపరాలను జాగ్రత్తగా గమనించి, బోధించుట, చదివించుట మొదలయిన వాటి ద్వారా పుష్కలంగా జ్ఞాన సంపదను ఆర్జించే పురుషులు తప్పనిసరిగా చేయవలసిన కర్మలకు అంకితమవుతారని ఆశించడం అసాధ్యం. (బోధన మరియు ఇతర రకాల శ్రమల ద్వారా వారిలో సోమరితనం పెరుగుతుందని కవి చురుక్కు).

---

శ్లోకం 17

ఆయస్య తావదపి కర్మ కరోతు కశ్చి-

త్తేనాపి మాత రధికం కిమిహానుభావ్యం

ఆస్తే సుఖం య ఇహ భారతవర్ష సీమ-

న్యాస్తే స కించిదిత ఉత్తరతోఽపసృత్య

ప్రతి పదార్థము

మాతః – తల్లీ మీనాక్షీ!, కశ్చిత్ – ఎవరో ఒకరు, ఆయస్య అపి – స్వర్గం కొరకు యజ్ఞాలు మొదలైనవి చేసి కష్టపడినప్పటికీ, కర్మ – కర్మ విషయంలో, కరోతు తావత్ – చేయగలిగినదంతా చేసినప్పటికీ, తేన + అపి – ఆ కర్మలచేత, ఇహ – ఈ లోకంలో, అధికం – అధికమైన ఫలితాన్ని, కిము అనుభావ్యం – ఏ ప్రత్యేక ఆనందాన్ని అనుభవిస్తాడు?, ఇహ భారతవర్ష సీమని – ఈ భారతదేశంలో, యః సుఖం ఆస్తే – (అమ్మవారిని కొలువకుండా) ఎవడు సుఖాన్ని పొందుతున్నాడు?, సః –

**అతడు, ఇతః — ఇంతకంటే, కించిత్ — కొంచెం, ఉత్తరతః — ఉత్తరానికి, అపసృత్య — దాగి (వెళ్లి), ఆస్తే — అవే సుఖాలను పొందుతున్నాడు.**

**తాత్పర్యము**

**తల్లీ! మీనాక్షీ! తనను తాను చాలా కష్టాలకు గురిచేసుకొని, నిర్దేశించిన యజ్ఞాలు మొదలైన కర్మలను ఒకడు చేసాడనుకొందాం. అతను తన ఈ బాధలకు ప్రతిఫలంగా ఏ ప్రత్యేక ఆనందాన్ని పొందుతాడు? ఈ భారతదేశంలో జీవిస్తూ, ఎవడైతే అమ్మవారిని అద్వైత భావనతో కొలిచి సంతోషంగా ఉంటున్నాడో, చనిపోయిన తరువాత కొంచెం ఉత్తరానికి వెళ్లి అదేవిధంగా సంతోషంగా ఉంటాడు. (రెండింటికి తేడా లేదని భావం).**

---

**శ్లోకం 18**

**కర్మ త్యజేమ యది నూన మధః పతేమ**

**యద్యాచరేమ న కదాపి భవంతరేమ**

**కర్మ త్యజేదితి చరేదితి చ ప్రవృత్తాః**

**భావేన కేన నిగమా ఇతి న ప్రతీమః**

**ప్రతి పదార్థము**

**యది కర్మ త్యజేమ — ఒకవేళ కర్మ మార్గాన్ని వదులుకుంటే, అధః పతేమ — నాశనమవుతాము (విముక్తి లేదని అధికార గ్రంథాలు ఘోషిస్తున్నాయి) నూనమ్ — నిశ్చయము. యది + ఆచరేమ — ఒకవేళ కర్మ మార్గాన్ని ఆచరిస్తే, భవం — ఈ "సంసారాన్ని", న కదాపి తరేమ — ఎప్పటికీ దాటలేము (అని కూడా వారు అంటున్నారు) కర్మ త్యజేత్ + ఇతి — కర్మ మార్గాన్ని విడవాలా?, చరేత్ + ఇతి చ — ఆచరీంచాలా?, అను ప్రవృత్తాః — అను ఆచరణములలో, నిగమాః — వేదములు, కేన భావేన — ఏ భావములతో ఉన్నాయో, ఇతి న ప్రతీమః — మనకు అర్థం కావటం లేదు.**

**తాత్పర్యము**

**తల్లీ! మీనాక్షీ! ఒకవేళ కర్మను వదులుకుంటే విముక్తి లేదని అధికార గ్రంథాలు ఘోషిస్తున్నాయి. కర్మ చేయడం వల్ల మనం ఈ "సంసారాన్ని" ఎప్పటికీ దాటలేమని కూడా అవి అంటున్నాయి. గ్రంథాలు సమర్థిస్తున్నాయి. అదే సమయంలో నిరాకరిస్తున్నాయి. కర్మమార్గ విషయంలో వేదాలు ఏ అభిప్రాయంతో ఉన్నాయో నిజంగా అర్థం కాలేని స్థితిలో ఉన్నాము. (అమ్మవారిని తెలియచేయమని కవి హృదయం).**

---

**శ్లోకం 19**

కర్మణ్య కర్మ విధి రేష యదాచరంతి

కర్మాణి తత్తదనుబంధ జిహాసయేతి

సత్యం తథాప్యభినవో భవితా న బంధః

ప్రాచీన బంధ హరణే క ఇవాభ్యుపాయః

ప్రతి పదార్థము

కర్మణి – కర్మలను, తత్ + తత్, అనుబంధ జిహాసయా – ఆయా అనుబంధములను విడుచు కోర్కెతో, యత్ ఆచరతి – ఒకవేళ చేస్తే, ఏషః కర్మాణి – ఈ కర్మలు, అకర్మ విధిః ఇతి – నిష్కామ విధిని పొందుతాయనునది, సత్యం – సత్యమైన విషయం, తథాపి – అయినప్పటికీ, అభినవః – కొత్తదయిన, బంధః – బంధము, న భవితా – భవిష్యత్తు లేనిది, ప్రాచీన బంధ హరణే – పూర్వ కర్మల బంధములను హరించు విషయంలో, అభ్యుపాయః – అంగీకారము; స్వీకారము, కః ఇవ – దేనివలె ఉంటుంది? (నిరోధించటానికి అసాధ్యమని భావం).

తాత్పర్యము

తల్లీ! మీనాక్షీ! ఈ జన్మలో కర్మలను నిష్కామములుగా (ప్రయోజనాలు కోరుకోకుండా) చేస్తే, అవి పునర్జన్మకు దారి తీయవన్న మాట సత్యమే. కాని పూర్వ కర్మల బంధములను (అనగా అనేక జన్మలనుండి వచ్చు ప్రారబ్ధ కర్మలను) హరించు విషయంలో, పునర్జన్మ మొదలైన ఫలితాలను మనం ఎలా నిరోధించగలం?

---

శ్లోకం 20

ప్రారబ్ధ కర్మ కియ దారభతే కియద్వా

ప్రారప్స్యతే కియ దిదం క ఇవావధత్తాం

కాలః కియానివ మయా ప్రతిపాలనీయో

యస్య క్షణార్థమపి కల్ప శతత్వమేతి

ప్రతి పదార్థము

ప్రారబ్ధ కర్మ – ధర్మాధర్మ కారణముగా జన్మమునెత్తించెడు కర్మ విశేషము, కియత్ కియత్ వా ఆరభతే – ఎంతెంత ఆరంభించబడినదో, (నా కోసం ఎంత పేరుకుపోయిందో, దానిలో ఎంత నాపై ఆధిపత్యం చెలాయించడం ప్రారంభించిందో) కియత్ ఇదం ప్రారప్స్యతే – భవిష్యత్తులో అది ఎంతవరకు పని చేయడం ప్రారంభిస్తుందో, కః ఇవ అవధత్తాం – ఎవనికి తెలుస్తుంది? (ఎవరికీ తెలియదని భావం) యస్య (మమ) – నాకు, క్షణ + అర్ధమపి – ఒక నిమిషంలోని

ప్రతిభాగం, కల్ప శతత్వమ్ ఇవ — వంద కల్పాల వలె, మయా — నాచేత, కియాన్ కాలః — ఎంత కాలము, ప్రతిపాలనీయః ఏతి — సంరక్షిస్తూ గడుస్తుంది?.

తాత్పర్యము

తల్లీ మీనాక్షీ! పూర్వజన్మ ప్రారబ్ధం నా కోసం ఎంత పేరుకుపోయిందో, దానిలో ఎంత నాపై ఆధిపత్యం చెలాయించడం ప్రారంభించిందో, మరియు భవిష్యత్తులో అది ఎంతవరకు అది పని చేయడం ప్రారంభిస్తుందో తెలుసుకోవడానికి నాకు మార్గం లేదు. నేను ఆలస్యాన్ని భరించలేకపోతున్నాను, ఎందుకంటే నాకు ఒక నిమిషంలోని ప్రతిభాగం ఇప్పుడు వంద కల్పాల వలె దుర్భరముగా ఉన్నది. (తన సంశయ నివృత్తి చేయమని కవి నివేదన).

---

శ్లోకం 21

పుంసః క్షణార్ధమపి సంసరణాక్షమస్య

సాంఖ్యాదయః సరణయో న విశంతి కర్ణం

సంఖ్యాయ గాంగ సికతాః సకలాశ్చ సూక్ష్మా

భుంక్ష్వేతి వాగివ మహాక్షుధయార్దితస్య

ప్రతి పదార్థము

సంసరణ — పాపము-పుణ్యము అనుభవించుటకు జనులు వచ్చు ఈ సంసారమును, క్షణ + అర్ధమపి — క్షణకాలము కూడా, అక్షమస్య పుంసః — భరించలేని వ్యక్తికి, సాంఖ్య + ఆదయః — సమ్యక్ జ్ఞానం కల్గించు సాంఖ్యదర్శనము మొదలయిన, సరణయః — మార్గములను చెప్పుట (ఎటువంటిదనగా) మహాక్షుధయా — తీవ్రమైన ఆకలితో, అర్దితస్య — బాధపడుతున్న వ్యక్తిని, సూక్ష్మాః గాంగ సికతాః సకలాః చ — గంగానది ఒడ్డున సూక్ష్మంగా ఉన్న సకలమైన ఇసుక రేణువులను, (కసతి హినస్తి పాదౌ పాదములను బాధపెట్టునది ఇసుకకు సికతా అని పేరు) సంఖ్యాయ — లెక్కించి (ఆపై) భుంక్ష్వ + ఇతి — తినమని చెప్పు, వాక్ + ఇవ — మాట వలె, కర్ణం న విశంతి — చెవిలోనికి ఎక్కదు.

తాత్పర్యము

తీవ్రమైన ఆకలితో బాధపడుతున్న వ్యక్తిని గంగానది ఒడ్డున సూక్ష్మంగా ఉన్న సకలమైన ఇసుక రేణువులను లెక్కించిన పిదప ఆపై తినమని చెప్పుట ఎటువంటిదో, ఈ సంసారమును క్షణకాలము కూడా భరించలేని వ్యక్తికి జ్ఞానము కలిగించు సాంఖ్యదర్శనము మొదలయిన మార్గములను చెప్పుట వ్యర్థం. అతని చెవిలోనికి ఎక్కదు.

---

శ్లోకం 22

**భక్తిస్తు కా యది భవేత్ రతిభావభేద-**

**స్తత్కేవలాన్వయితయా విఫలైవ భక్తిః**

**ప్రీతి స్త్వయి త్రిజగ దాత్మని కస్య నాస్తి**

**స్వాత్మ ద్రుహో న ఖలు సంతి జనా స్త్రిలోక్యాం**

**ప్రతి పదార్థము**

**భక్తిః తు కా – భక్తి అంటే ఏమిటి?, యది – ఒకవేళ, రతి భావ భేదః – అది ప్రేమయొక్క జాతి, భవేత్ – అయినచో, తత్ – అది, కేవలన్వయితయా – అస్తిత్వము లేనిది, భక్తిః – అప్పుడు భక్తి అనునది, విఫలా + ఏవ – ఫలము లేనిది, త్రిజగత్ + ఆత్మని – మూడు లోకములు ఆత్మగా కలిగిన, త్వయి – నీయందు, కస్య – ఎవనికి, ప్రీతిః నాస్తి – లేదు?, త్రిలోక్యాం – మూడు లోకాలలోనూ, స్వాత్మ ద్రుహః – తమను తాము ద్వేషించుకునే, జనాః – జనులు, న సంతి ఖలు – ఎవరూ ఉండరు కదా!**

**తాత్పర్యము**

**(జ్ఞానమార్గం మరియు కర్మమార్గం ద్వారా పుణ్యం పొందడం ఎంత అసాధ్యమో వివరిస్తూ, కవి ఇప్పుడు భక్తిమార్గాన్ని విశ్లేషిస్తున్నాడు.) భక్తి అంటే ఏమిటి? ఇది ప్రేమయొక్క జాతిగా నిర్వచించబడినట్లయితే అది స్పష్టంగా వ్యర్థం. ఎందుకంటే, అది లేనివారు ఎవరూ ఉండరు. నువ్వు అన్ని జీవులలో వ్యాపించి ఉన్నందున తనను తాను ప్రేమించని వ్యక్తి ఉండడు. మూడు లోకాలలోనూ తమను తాము ద్వేషించుకునేవారు ఎవరైనా ఉన్నారా? (ఎవరూ ఉండరని భావం. కనుక ప్రేమ అనేది భక్తి కాదని దీక్షితులవారి అభిప్రాయంగా తోచుచున్నది.)**

---

**శ్లోకం 23**

**ఆత్మా సమస్త జగతాం భవతీతి సమ్య-**

**గ్విజ్ఞాయ యద్వితనుతే త్వయి భావబంధం**

**సా భక్తి రిత్యభిమతం యది సిద్ధమిష్టం**

**వ్యర్థం విశేష్య మలమస్తు విశేషణం నః**

**ప్రతి పదార్థము**

**భవతీ – మీరు (మీనాక్షి), సమస్త జగతాం – సమస్త ప్రపంచముల, ఆత్మా – ఆత్మ, ఇతి – అని, సమ్యక్ – చక్కగా, విజ్ఞాయ – తెలిసికొని, త్వయి – నీయందు, భావబంధం – ఆనందము, యత్ వితనుతే – ఒకవేళ వ్యాపిస్తే, సా భక్తిః ఇతి – అది భక్తి అని, అభిమతం – సమ్మతము, ఇష్టం – కోరఁబడినది; ప్రియమైనది, సిద్ధమ్ – ప్రమాణాలతో నిశ్చయింపబడినది,**

విశేష్యమ్ — ప్రధానమైనది, వ్యర్థం — వ్యర్థమైనది, నః — మాకు, విశేషణం — వస్తువులను, ద్రవ్యములను వేరుచేయు వివేకము అనే సాధారణ పేరు, అలమ్ అస్తు — సరిపోతుంది.

**తాత్పర్యము**

మీనాక్షీ! లోకంలో ప్రకాశించే జీవరాశులన్నీ నీవే తప్ప మరేమీ కాదన్న జ్ఞానాన్ని కలిగి ఉండి, సమస్త ప్రపంచములలో ఉన్న ఆత్మ నువ్వే అని చక్కగా తెలిసికొని, భక్తి అంటే మీ కోసం పెట్టే ప్రేమ అని నిర్వచించినట్లయితే అప్పుడు, అది సరే; (ఎలాగోలా ఒప్పుకొంటామని భావం) కానీ ఆ సందర్భంలో విశేష్యము (జ్ఞానము) ప్రధానమైనది. విశేషణం (భక్తి) అప్రధానమైనది.

---

**శ్లోకం 24**

స్వాత్మేతరత్వ మవధార్య పరత్వ బుద్ధ్యా

యత్ ప్రీతే గురుజనేష్వివ సైవ భక్తిః

స్యా దేతదేవ మియమేవ తు మే జిహాస్యా

ద్వైతభ్రమాత్ కిమధికం భవ బంధమూలం

**ప్రతి పదార్థము**

స్వ + ఆత్మా + ఇతరత్వమ్ — భగవంతుడు తనకు భిన్నంగా ఉన్నాడని, అవధార్య — తెలుసుకొని, పరత్వ బుద్ధ్యా — వేరు బుద్ధితో, గురుజనేషు + ఇవ — ఆచార్య పీఠము మొదలైన వాటిలో ఆనందించినట్లే, యత్ + ప్రీతే — భగవంతునియందు ఆనందించడము కూడా, సా + ఏవ భక్తిః — అదే భక్తి, ఏతత్ ఏవం స్యాత్ — ఇలా ఉందని చెబితే, తత్ + ఏవ — అది, ఇయమ్ + ఏవ తు — ఇది కూడా, మే జిహాస్యా — నా సూత్రాలకు పూర్తిగా విరుద్ధం, ద్వైత భ్రమాత్ — భగవంతుడు వేరు, మనము వేరు అనే "ద్వైత" బుద్ధి, అధికం — అధికమైన, భవ బంధ మూలం — జన్మదోషాలకు, కిమ్ — కారణం కదా?!

**తాత్పర్యము**

తల్లీ! మీనాక్షీ! భగవంతుడు తనకు భిన్నంగా ఉన్నాడు, అతనే సర్వోన్నతుడు. మనము హీనులమని తెలిసి, ఆచార్య పీఠము మొదలైన వాటిలో ఆనందించినట్లే, భగవంతునియందు ఆనందించడము కూడా భక్తి అని చెబితే, ఇది మా అద్వైత సూత్రాలకు పూర్తిగా విరుద్ధం. భగవంతుడు వేరు, మనము వేరు అనే "ద్వైత" బుద్ధి జన్మదోషాలకు మూలకారణం.

---

**శ్లోకం 25**

సేవైవ భక్తి రితి కర్మ పథ ప్రవేశః

సేవ్య ప్రసాద ఫలకా కిల కర్మసేవా

ధ్యాన ప్రవాహ ఇతిచేత్ శ్రవణాత్ తృతీయః

ప్రాగేవ మాత రయమాకలితోఽభ్యుపాయః

ప్రతి పదార్థము

మాతః – ఓ తల్లీ మీనాక్షీ!, సేవా ఏవ – సేవనే, భక్తిః ఇతి – భక్తి అని పిలిస్తే, కర్మ పథ ప్రవేశః – అది కర్మ మార్గంలోకి ప్రత్యక్ష ప్రవేశాన్ని కలిగి ఉంటుంది, కర్మసేవా – కర్మసేవ అనేది, సేవ్య ప్రసాద ఫలకా కిల – సేవింపదగినవాని అనగా యజమాని అనుగ్రహముతో కూడుకొన్నది, ధ్యాన ప్రవాహః ఇతిచేత్ – భక్తి అనేది ధ్యానమైతే, శ్రవణాత్ తృతీయః – అది శ్రవణం, మననం, నిదిధ్యాసనములలో మూడవ సాధనగా, ప్రాగేవ – పూర్వమే, అయమ్ – ఈ, అభ్యుపాయః – అంగీకారము, ఆకలితః – తెలుసుకొనబడినది.

తాత్పర్యము

తల్లీ మీనాక్షీ! సేవను భక్తి అని పిలిస్తే, అది కర్మ మార్గంలోకి ప్రత్యక్ష ప్రవేశాన్ని కలిగి ఉంటుంది. యజమాని తన పట్ల సంతృప్తి చెందడం ద్వారా సేవకుడికి ప్రతిఫలం లభిస్తుందని అందరికీ తెలుసు. భక్తి అనేది ధ్యానమైతే, ఇది "శ్రవణం" నుండి మూడవది కాబట్టి ఇది మనకు ఇప్పటికే తెలిసిన ఒక పద్ధతి. (శ్రవణ మనన నిధిధ్యాసనాదులలో ధ్యానం మూడవది) కాబట్టి దానికి భక్తి అని కొత్త పేరు పెట్టనవసరం లేదు.

---

శ్లోకం 26

అత్రైవ దాస్యసి విముక్తి మథాపి యాచే

మాతః శరీర పతనం మణికర్ణికాయాం

అస్తు స్వకృత్య మనుకంపన మీశ్వరాణాం

దాసస్య కర్మకర తైవ తథా స్వకృత్యం

ప్రతి పదార్థము

మాతః – తల్లీ! మీనాక్షీ!, అత్ర + ఏవ – భక్తుడనైన నేను ఉన్నచోటనే, విముక్తిమ్ – నాకు మోక్షాన్ని, దాస్యసి – ఇస్తావు, అథాపి – కాని, మణికర్ణికాయాం – మణికర్ణికకు వెళ్లి, శరీర పతనం – మోక్షం కోసం శరీరాన్ని విడిచిపెట్టాలని, యాచే – నిన్ను యాచిస్తున్నాను, అనుకంపనమ్ – జాలితో, ఈశ్వరాణాం – ప్రభువుయొక్క, స్వకృత్యమ్ – చేయవలసిన పనిలేకుండా వేతనాలు ఇస్తున్నాడు, అస్తు – అగుగాక!, తథా – అయినప్పటికి, దాసస్య – దాసునికి, కర్మకరతా ఏవ – పనిచేస్తూ, స్వకృత్యం – వేతనాలు పొందాలనుకుంటున్నాడు.

**తాత్పర్యము**

తల్లీ! భక్తుడనైన నేను ఉన్నచోట నీ దయవల్ల నాకు మోక్షాన్ని ప్రసాదిస్తావు. కానీ నేను మణికర్ణికకు వెళ్లి మోక్షం కోసం శరీరాన్ని విడిచిపెట్టాలనుకుంటున్నాను. ప్రభువు సేవకునిపై జాలిపడి పనిలేకుండా వేతనాలు ఇస్తున్నాడు, అయితే సేవకుడు పనిచేస్తూ వేతనాలు పొందాలనుకుంటున్నాడు. అందుచేత మోక్షం కోసం తీర్థయాత్ర నిర్వహించి మోక్షాన్ని పొందాలని కోరుకుంటున్నాను. (మోక్షాన్ని కోరుకునే వ్యక్తి తన చివరి రోజులలో కాశీలో గడపాలని ఆజ్ఞాపించబడ్డాడు కనుక).

---

**శ్లోకం 27**

**సద్యో భవేత్ సుకృతినా ముపదేశ లాభః**

**పాపాత్మనాం బహుతిథే సమయే వ్యతీతే**

**ఇత్యాదిభిః కిల పురాణ వచోభిరంబ**

**వారాణసీ మపిన యాచితు ముత్సుకోఽస్మి**

**ప్రతి పదార్థము**

**అంబ – తల్లీ! మీనాక్షీ!, సుకృతీనామ్ – పుణ్యాత్ములకు మాత్రమే, ఉపదేశ లాభః – మరణించినవారి చెవిలో శివుడు చెప్పే ఉపదేశ లాభము (మోక్షము), సద్యః భవేత్ – వెంటనే కలుగుతుంది, పాపాత్మనాం – పాపాత్ములకు, బహుతిథే సమయే – చాలా కాలం, వ్యతీతే – గడిచిన తరువాత (భవేత్ – మోక్షం కలుగుతుంది), ఇతి + ఆదిభిః పురాణ వచోభిః – మొదలయిన పురాణ వచనములచేత, వారాణసీమ్ + అపి – వారణాసిలోని మణికర్ణికకు వెళ్లి మోక్షం కోసం శరీరాన్ని విడిచిపెట్టాలను, యాచితుమ్ – అభ్యర్థనయందు, ఉత్సుకః నాస్మి కిల – నాకు ఉత్సాహము లేదు కదా!**

**తాత్పర్యము**

తల్లీ! మీనాక్షీ! “పుణ్యాత్ములకు మాత్రమే మరణించినవారి చెవిలో శివుడు చెప్పే ఉపదేశ లాభము (మోక్షము) కాశీలో వెంటనే కలుగుతుంది. పాపాత్ములకు చాలా కాలం గడిచిన తరువాత కాశీలో మోక్షం కలుగుతుంది” అని పురాణములు చెబుతున్నాయి. అందువలన వారణాసిలోని మణికర్ణికకు వెళ్లి మోక్షం కోసం శరీరాన్ని విడిచిపెట్టాలను అభ్యర్థనయందు నాకు ఉత్సాహము లేదు కదా!

---

**శ్లోకం 28**

**ఆక్రాంత మంతరరిభిః మద మత్సరాద్యైః**

**గాత్రం వలీ పలిత రోగ శతానువిద్ధం**

**దారైః సుతైశ్చ గృహమావృత ముత్తమర్ణైః**

**మాతః కథం భవతు మే మనసః ప్రసాదః**

**ప్రతి పదార్థము**

**అంతః — నా అంతరంగం, మద మత్సర + ఆద్యైః — మదము, మత్సరము మొదలయిన, అరిభిః — శత్రువులతో, ఆక్రాంతమ్ — ఆక్రమించబడినది, గాత్రం — శరీరము, వలీ — ముడతలు (ముడుచుకుపోవడం), పలిత — వెంట్రుకలు తెల్లనగుటతోపాటు, రోగ శత + అనువిద్ధం — వంద (అనేక) రోగములకు చుట్టుకొనిపోయింది. (బలైపోయింది). ఉత్తమర్ణైః — (ఉత్తమం ఋణం యస్య) అప్పు ఇచ్చువారిచేత, దారైః సుతైః + చ — భార్యా కుమారులచేత, గృహమ్ — నా ఇల్లు, ఆవృతమ్ — కప్పివేయబడింది, మాతః — ఓ తల్లీ! మీనాక్షీ!, మనసః ప్రసాదః — మనస్సుకు శాంతి, మే కథం భవతు — నాకు ఎలా కలుగుతుంది?**

**తాత్పర్యము**

**ఓ తల్లీ! మీనాక్షీ! అహంకారం మరియు అసూయ వంటి అసహ్యకరమైన కోరికలతో నా అంతరంగం ఆక్రమించబడింది. నా శరీరం ముడుచుకుపోవడం, వెంట్రుకలు నెరిసిపోవడంతోపాటు అనేక అనారోగ్యాలకు బలైపోయింది. ఋణదాతలతో నా భార్యా కుమారులతో నా ఇల్లు ఆక్రమించబడింది. తల్లీ, ఇటువంటి స్థితిలో నేను మనశ్శాంతిని ఎలా పొందగలను? (తనపై కరుణ చూపమని భక్తుని వేడికోలు).**

---

**శ్లోకం 29**

**ధన్యాః కతి త్రిభువనే పరమోప భోగ్యం**

**సంసార మేవ పరమేశ్వరి భావయంతః**

**ఆభాస రూప మవబోధ మిమం సమేత్య**

**క్లిశ్యే కియత్ కియదహం త్వమునా భవేన**

**ప్రతి పదార్థము**

**పరమేశ్వరి — తల్లీ! మీనాక్షీ!, సంసారం ఏవ — సంసారమే, పరమ + ఉప భోగ్యం — చక్కగా అనుభవింపదగినదని, భావయంతః — భావించేవారు, త్రిభువనే — ఈ మూడు లోకాలలో, కతి ధన్యాః — ఎంతమంది ధన్యులు ఉన్నారు?, ఇమం — ఈ, ఆభాస రూపమ్ — కంటికి కనిపించినప్పటికీ నిజంకానిదయిన (భ్రాంతి), అవబోధమ్ — వివేకముతో, సమేత్య — కూడుకొని, అమునా భవేన — ఈ జన్మలో, అహం తు — నేను, కియత్ క్లిశ్యే — ఎంత బాధపడతాను? (బాధపడతానని భావం).**

**తాత్పర్యము**

తల్లీ! మీనాక్షీ! సంసారమే చక్కగా అనుభవింపదగినదని భావిస్తున్న ధన్యులు ఈ మూడు లోకాలలో ఎంతమంది ఉన్నారు? (చాలా తక్కువ మంది ఉంటారని కవి హృదయం). కంటికి కనిపిస్తున్నప్పటికీ ఈ సంసారం నిజం కాదని, భ్రాంతి అనే వివేకము కలిగిన నేను ఈ జన్మలో ఇంకా ఎంతకాలం బాధపడాలి? (తన బాధను తొలగించమని, మోక్షం కలిగించమని - భ్రాంతి అని తెలిసి ఈ సంసారంలో మనుగడ సాగించటం కష్టంగా ఉందని తల్లి దగ్గర బిడ్డ మొరపెట్టుకొన్నట్లుగా కవి మీనాక్షీదేవికి నివేదిస్తున్నాడు).

---

**శ్లోకం 30**

**కా సంస్కృతిః కిమపచార నిబంధనేయం**

**కీదృగ్విధస్య తవ కిం క్షత మేతయేతి**

**ప్రశ్నేతు నాస్మి కుశలః ప్రతివక్తు మేవ**

**ఖేదస్తు మే జనని కోఽప్యయ మేవమాస్తే**

**ప్రతి పదార్థము**

జనని – తల్లీ! మీనాక్షీ!, కా సంస్కృతిః – సంసారం' అంటే ఏమిటి? (సంసృతి = సమ్యక్ సరతి గచ్ఛతి చక్కగా తిరుగునది. సంసారచక్రము) ఇయం కిమ్ – దాని ప్రభావం ఏమిటి?, తవ – నీకు, కీదృక్ విధస్య – ఏ విధమైన, అపచార నిబంధనా – అపచార నిబంధనలున్నాయి?, ఏతయా – దీని వలన, కిం క్షతమ్ – ఏమి హానికలిగింది?, ఇతి ప్రశ్నే తు – మీరు ఇలాంటి ప్రశ్నలు వేస్తే, ప్రతివక్తుమ్ – సమాధానం చెప్పడానికి, కుశలః – సమర్థుడిని, మే న + అస్మి ఏవ – కానేకాదు కదా!, ఏవమ్ – ఇది (ఇందులో - ఈ సంసారములో), కః అపి అయమ్ – ఏదో ఒక రకమైన (వర్ణించలేని), ఖేదః తు ఆస్తే – బాధ అయితే ఉన్నదని నాకు తెలుసు.

**తాత్పర్యము**

తల్లీ! మీనాక్షీ! ''సంసారం' అంటే ఏమిటి? దాని ప్రభావం ఏమిటి? నీ స్వభావం ఏమిటి? ఈ "సంసారం" నీకు ఏమి హాని చేసింది?'' మీరు ఇలాంటి ప్రశ్నలు వేస్తే, నేను దేనికీ సమాధానం చెప్పలేను. ఈ సంసారంలో ఏదో ఒక రకమైన – వర్ణించలేని - బాధ అయితే ఉన్నదని మాత్రం నాకు తెలుసు.

---

**శ్లోకం 31**

**ఏవం గతస్య మమ సాంప్రతమేత దర్హ**

మత్రేద మౌపయిక మిత్థ మిదంచ సాధ్యం

అస్మిన్ ప్రమాణ మిద మిత్యపి బోద్ధుమంబ

శక్తిర్న మే భువనసాక్షిణి కిం కరోమి

ప్రతి పదార్థము

భువనసాక్షిణి – సకల జగత్తుకు శాశ్వత సాక్షీభూతురాలా!, అంబ – అమ్మా! మీనాక్షీ!, ఏవం గతస్య మమ – సంసార విషయికంగా ఇటువంటి ఆలోచనల మార్గంలో ఉన్న నాకు, సాంప్రతమ్ – ఇప్పుడు, ఏతత్ + అర్హామ్ – ఈ ప్రశ్నకు తగిన జవాబు ఇది అని, ఇదమ్ అత్ర – ఈ ప్రశ్నకు జవాబు ఈ గ్రంథంలో లేక ఇక్కడ లభిస్తుందని, ఔపయికమ్ – ఉపాయేన లబ్ధః ఈ ఉపాయంతో లభిస్తుందని, ఇదమ్ – ఇది, ఇత్థమ్ చ – అనేన ప్రకారేణ ఈ విధంగా, సాధ్యం – సాధ్యపడుతుందని, ఇదమ్ అస్మిన్ – ఈ ప్రశ్నకు ఇది ప్రమాణమ్ – ప్రమాణమయిన జవాబని, ఇతి + అపి – ఈ విధంగా, బోద్ధుమ్ – తెలియుటకు, న మే శక్తిః – నాకు శక్తి లేదు, కిం కరోమి – ఏమి చేయుదును? (సంశయాన్ని తీర్చమని అమ్మవారికి దీక్షితులు విన్నవిస్తున్నారు).

తాత్పర్యము

ఓ తల్లీ, సకల జగత్తుకు శాశ్వత సాక్షి అయిన అమ్మా! మీనాక్షీ! ''సంసారం' అంటే ఏమిటి? దాని ప్రభావం ఏమిటి? దాని హద్దు ఏమిటి?'' ఈ తెగని సంసార ప్రశ్నకు తగిన జవాబు ఇది అని, ఈ ప్రశ్నకు జవాబు ఈ గ్రంథంలో లేక ఇక్కడ లభిస్తుందని, ఈ ఉపాయంతో లభిస్తుందని, జవాబు ఈ విధంగా సాధ్యపడుతుందని, ఈ ప్రశ్నకు ఇది ప్రమాణమయిన జవాబని ఈ విధంగా తెలియుటకు నాకు శక్తి లేదు. ఈ దుస్థితిలో, నేను ఏమి చేయాలో, ఏ లక్ష్యంతో మరియు ఏ నియమంతో ముందుకు సాగాలో నిర్ణయించడం అసాధ్యంగా ఉంది. ఇలా దుఃఖిస్తూ - ఈ దుఃఖాన్ని ఎలా పోగొట్టుకోవాలో తెలియడం లేదు. ఏమి చేయుదును? (సంశయాన్ని తీర్చమని, దుఃఖనివృత్తి చేయమని అమ్మవారికి దీక్షితులు విన్నవిస్తున్నారు).

---

శ్లోకం 32

నజ్ఞాయతే మమ హితం నితరా ముపాయో

దీనోఽస్మి దేవి సమయాచరణాక్షమోఽస్మి

తత్త్వా మనన్య శరణః శరణం ప్రపద్యే

మీనాక్షి విశ్వ జననీం జననీం మమైవ

ప్రతి పదార్థము

దేవి — (దీవ్యతి కృతాభిషేక రాజ్ఞహిషీ) అనేక విధములుగా ఆడునది. దుర్గ; అభిషేకింపబడ్డ రాణీ; మీనాక్షి — తల్లీ! మీనాక్షీ!, మమ — నాకు, హితం — ఏది మంచిదో, న జ్ఞాయతే — నాకు తెలియదు, నితరామ్ — (నితరాం అతిశయం సర్వదా) మిక్కిలి; ఎల్లప్పుడు, ఉపాయః — ఉపాయము తెలియదు, దీనః + అస్మి — నియమాలకు కట్టుబడి ఉండలేక నిస్సహాయంగా ఉన్నాను, సమయాచరణ — (సమయస్య కర్తవ్యస్య ఆచారః ఆచరణమ్) కర్తవ్యాచరణము చేయుటలో, అక్షమః + అస్మి — అసహనము కలిగి ఉన్నాను. (నిబంధనలను అమలు చేయడానికి శక్తి లేనివాడినని భావం) తత్ — అందువలన, అనన్య శరణః — ఇతరుడు రక్షకుడుగాలేనివానిని; ఇతరుని శరణు గోరనివాడినయిన నేను, విశ్వజననీం — విశ్వమునకు తల్లివి, మమ ఏవ — నాయొక్క, జననీం — తల్లివైన, త్వాం — నిన్ను, శరణం ప్రపద్యే — శరణు కోరుచున్నాను.

తాత్పర్యము

తల్లీ! మీనాక్షీ! ఏది మంచిదో నాకు తెలియదు-- ఉపాయము తెలియదు. నేను దౌర్భాగ్యుడను. నియమాలకు కట్టుబడి ఉండలేక నిస్సహాయంగా ఉన్నాను. నిస్సహాయంగా వెతుకుతున్నాను. విశ్వమాతవు, నా స్వంత తల్లి అయిన నీకు శరణు. (సన్మార్గం చూపించమని కవి అమ్మవారిని వేడుకొంటున్నాడు).

---

శ్లోకం 33

కించిన్ మయా శ్రుతిషు కించిదివా గమేషు

శాస్త్రేషు కించి దుపదేశ పథేషు కించిత్

అప్రూత మస్తి యదతో భవతీం వరీతుం

గోప్త్రీతి కాచి దుదపద్యత బుద్ధిరేషా

ప్రతి పదార్థము

మయా — నాచేత, శ్రుతిషు — వేదములు చదువుటవలన (శ్రుతి = శ్రూయతే జ్ఞాయతే అనయా, అర్థః మంత్ర బ్రాహ్మణమ్ దీనితో అర్థం తెలియును. వేదము), కించిత్ — ఇంచుకంత, ఆగమేషు — పూజావిధానాలను, ఆలయ నిర్మాణాది విశేషాలను తెలియజేసే శైవాగమాల ద్వారా, కించిత్ ఇవ — కొంచెం వలె, శాస్త్రేషు — శాస్త్రములు నేర్చుకొనుటవలన, కించిత్ — కొంచెం, ఉపదేశ పథేషు — గురువులు మంత్రాదులుపదేశించిన మార్గముల ద్వారా, కించిత్ — కొంచెం, యత్ — ఏదయితే, అప్రూతమ్ అస్తి — నాచేత వాసన చూడబడి ఉన్నదో, అతః — అందువలన (అది), భవతీం — నిన్ను, గోప్త్రీ + ఇతి — రక్షించుదానివని, వరీతుం — ఎంచుకొనుటకు, ఏషా కాచిత్ బుద్ధిః — ఈ బుద్ధిని, ఉదపద్యత — కలిగింది.

తాత్పర్యము

వేదాలలో కొంచెం, శైవ సాహిత్యంలో కొంచెం, శాస్త్రాలు మరియు మంత్రాలలో కొంచెం, దీక్షా ప్రక్రియ ద్వారా ఏదయితే కొంచెం నేర్చుకున్నానో, ఆ కొద్దిపాటి బుద్ధి నిన్ను నారక్షకురాలివని తెలుసుకొనేటట్లు చేసింది.

---

**శ్లోకం 34**

**బ్రహ్మైవ మేవ మహ మేష తదాప్త్యుపాయ**

**ఇత్యాగమార్థ విధురాః ప్రథమే దయార్హాః**

**త్వద్రక్షకత్వ గుణమాత్ర విదో ద్వితీయా**

**ఇత్యర్థయే సదధికారనిరూపణాయ**

**ప్రతి పదార్థము**

బ్రహ్మ + ఏవమ్ – బ్రహ్మము ఇలా అని, (బ్రహ్మ = నిరతిశయ మహత్త్వ లక్షణ వృద్ధిమాన్ భవతి ఎక్కువగా వృద్ధి గలవాడు. బ్రహ్మ; ఈశ్వరుడు; వేదము.), అహమ్ ఏవమ్ – నేను ఇలా ఉన్నాను అని, తత్ + ఆప్తి + ఉపాయః – దాన్ని పొందే విధానము, ఏషః – ఇది, ఇతి – అని, ఆగమ + అర్థ విధురాః – శాస్త్రార్థం తెలియనివారు, ప్రథమే దయ + అర్హాః – అందరిలోను మొదటగా నీ దయ పొందుటకు యోగ్యమైనవారు, త్వత్ + రక్షకత్వ గుణమాత్ర విదః – మీరు రక్షక స్వభావానికి చెందినవారని మాత్రమే తెలిసిన నాలాంటివారు, ద్వితీయా ఇతి – రెండవ స్థానంలో నిలిచినవారు, సదధికార నిరూపణాయ – బ్రహ్మజ్ఞాన నిరూపణము కొరకు, అర్థయే – నేను మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాను.

**తాత్పర్యము**

తల్లీ మీనాక్షీ! బ్రహ్మము మరియు జీవునిపై వేదాలు ఏమి చెబుతున్నాయనే విషయం గురించి పూర్తిగా తెలియనివారు మొదటి స్థానంలో ఉంటారు. మరియు బాధలో ఉన్నవారికి ఉపశమనం కలిగించడం మీ స్వభావమని, రక్షించటం మీ అలవాటని తెలిసిన నావంటివారు తరువాత రెండవ స్థానంలో వస్తారు. బ్రహ్మ విద్యకు అధికారి నిరూపణము చేయుటలో శాస్త్రము సాధన చతుష్టయ సంపత్తి కలవాడే అధికారి అని చెప్పింది కదా! అటువంటి అర్హత లేనప్పటికీ బ్రహ్మజ్ఞాన నిరూపణము కొరకు అర్హతను కలిగించి నన్ను రక్షించాలని అభ్యర్థిస్తున్నాను.

**విశేషము**

**సాధన చతుష్టయం:**

1. నిత్యానిత్య వస్తువివేకం: సృష్టిలో ప్రతి వస్తువు ఎప్పుడో ఒకప్పుడు నశించేదే అని సులభంగానే తెలుస్తుంది. అంటే, అవన్నీ అనిత్యాలు. అనిత్యాలు ఉన్నప్పుడు నిత్యమైనది ఏదో ఉండాలి కదా అనే జిజ్ఞాస కలుగుతుంది. ఆ విధంగా విచారణ చేయడం, తెలుసుకొనడం, నిత్యానిత్య వస్తువివేకం.

2. ఐహికాముష్మిక ఫలభోగ విరాగం: భోగాలని వేటిని గురించి భావిస్తున్నామో అవన్నీ అశాశ్వతమైనవే. మనం గమనిస్తున్న ఈ లోకంలోని భోగాలేగాక స్వర్గాది లోకాలలోని భోగాలూ అంతే అనే వైరాగ్య భావన రావడం ఇహాముత్రార్థభోగ విరాగం.
3. శమ దమాది షట్క సంపత్తి:
    - శమం: అంతరింద్రియ నిగ్రహం.
    - దమం: బహిరింద్రియ నిగ్రహం.
    - ఉపరమ/ఉపరతి: విషయ వాసనలను విరమించుకోవడం.
    - తితిక్ష: వాతావరణ తీవ్రతలను, ఇతర బాధలను ఓర్చుకోవడం.
    - శ్రద్ధ: శాస్త్రాదుల పట్ల, దైవం పట్ల విశ్వాసం కలిగి వ్యవహరించటం.
    - సమాధి: ధ్యాన వస్తువులో మనసు లీనం కావడం.
4. ముముక్షత్వం: మోక్షాన్ని దృఢంగా కోరడమే ముముక్షత్వం. శ్రవణ, మనన, నిధిధ్యాసలు మోక్షనిధికి సాధనాలు.

**శ్లోకం 35**

**మాతాకరోషిమమతాంమయియావదీష-**

**త్తావద్యతేమమతతఃకిమివాస్తిసాధ్యం**

**మామిత్థమిత్థముపయుంక్ష్వనవిస్మరేతి**

**కింస్వామినంత్వరయతేక్వచనస్వభృత్యః**

.. **35** ..

**అన్వయంతో కూడిన ప్రతిపదార్థం:**

మాతా = అమ్మా! మీనాక్షీ! మయి = నాయందు, ఈషన్మమతాం = కొంచెంపాటి అభిమానాన్ని, యావత్కరోషి = నువ్వు ఎంతగా చూపిస్తావో, తావత్ +యతే = అదే నాకు ప్రాప్తంగా భావిస్తాను. తతః = అంతకంటే, కిమివ మమ సాధ్యమ్ అస్తి = నాకు ఎక్కువ సాధ్యమవుతుందా ఏమిటి? (సాధ్యము కాదని భావం)

స్వామినం = తన యజమానిని, స్వభృత్యః = తన సేవకుడు, మామ్ = నన్ను (నా సేవలను) ఇత్థమ్ + ఇత్థమ్ = ఈ విధంగా లేదా ఆ పద్ధతిలో, ఉపయుంక్ష్వ = ఉపయోగించుకోవటం, నవిస్మర +ఇతి = మరచిపోవద్దని, క్వచన = ఎప్పుడైనా, కిం త్వరయతే = తొందరపెట్టగలడా? (తొందరపెట్టలేడని భావం)

**తాత్పర్యం:**

అమ్మా! మీనాక్షీ! నాపై కొంచెంపాటి అభిమానాన్ని నువ్వు ఏ సమయంలో ఎంతగా ప్రదర్శిస్తావో, అదే నాకు ప్రాప్తంగా భావిస్తాను. అంతకంటే నాకు ఎక్కువ సాధ్యమవుతుందా ఏమిటి? (నాపై ఎక్కువ అభిమానాన్ని చూపించమని చెప్పుట నాకు సాధ్యము కాదని భావం). తన యజమానిని సేవకుడు, నా సేవలను ఈ విధంగా లేదా ఆ పద్ధతిలో ఉపయోగించుకోవటం మరచిపోవద్దని, ఎప్పుడైనా తొందరపెట్టగలడా? (ఎలా యజమానిని సేవకుడు తొందరపెట్టలేడో, భక్తుడనైన నేను కూడా - నన్ను మరచిపోవద్దని నీతో చెప్పే సాహసం చేయలేనని, నువ్వే నా సమస్త జీవనాన్ని రక్షించాలని భావం).

---

శ్లోకం 36

త్యాజ్యంత్యజానివిహితంచసమాచరాణి

నిత్యేషుశక్తిమనురుధ్యహివర్తితవ్యం

తద్బుద్ధిశక్తిమనురుద్ధ్యనకార్యశక్తి-

మిత్యేతదేవతుశివేవినివేదయామి

.. 36 ..

అన్వయంతో కూడిన ప్రతిపదార్థం:

శివే = శివుని ఇల్లాలా! తల్లీ! మీనాక్షీ! త్యాజ్యం = విడువదగినవాటిలో. (జ్యోతిశ్శాస్త్రములో దోషయుక్తమైన కొంతకాలము త్యాజ్యమని చెప్పబడును.) త్యజాని = 1. మాసము, 2. వారము, 3. నక్షత్రము, 4. యోగము, 5. లగ్నము. అనువాటిలోని త్యాజ్యములలో, విహితంచ = (విధినా బోధితః) శాస్త్రోక్తంగా చెప్పబడినవానిలో. సమాచరాణి = లోపము లేకుండా చక్కగా చేయు పనులలో, నిత్యేషు = కలియుగంలో ఆచరించవలసిన పరాశరస్మృతి ఆరు నిత్యకర్మలను పేర్కొన్నది. "సంధ్యా, స్నానం, జపో, హోమో, దేవతానాంచ పూజనమ్/ఆతిథ్యం, వైశ్వదేవంచ, షట్కర్మాణి దినేదినే." అంటే, సంధ్య, స్నానం, జపం, హోమం, దేవతార్చన, అతిథిపూజ, వైశ్వదేవం అనే ఆరు నిత్యకర్మలలో, శక్తిమ్ = శక్తిని, అనురుధ్య = అనుసరించి, వర్తితవ్యంహి = ప్రవర్తింపవలసి ఉన్నది కదా! (కింతు = కాని) తత్ +బుద్ధిశక్తిమ్ +అనురుద్ధ్య = ఆ బుద్ధిశక్తిని అనుసరించి, నకార్యశక్తిమ్ = చేసే పని ఉండుటలేదు ఇతి = అని, ఏతదేవతు = ఇదంతా, (నా అసమర్థతను) వినివేదయామి = నీకు నివేదించుచున్నాను.

తాత్పర్యం:

శివుని ఇల్లాలా! తల్లీ! మీనాక్షీ! విడువదగినవాటిలో, శాస్త్రోక్తంగా చెప్పబడినవానిలో, లోపము లేకుండా చక్కగా చేయు పనులలో, నిత్యకర్మలలో బుద్ధిశక్తిని అనుసరించి అన్నీ పాటించాలి, చేయాలి అనుకొంటాను. కాని ఆ బుద్ధిశక్తిని అనుసరించి నేను చేసే పని ఉండుటలేదు. నా అసమర్థతను నీకు నివేదించుచున్నాను.

**విశేషము:**

**బుద్ధికి తగినట్లుగా శారీరక ఇబ్బందుల వలన ప్రవర్తించలేకపోతున్నాను. కనుక బుద్ధికి తగిన కార్యశక్తిని ప్రసాదించమని అమ్మవారికి భక్తుని నివేదన ఈ శ్లోకంలో అంతరార్థముగా అనిపించుచున్నది.**

---

**శ్లోకం 37**

**ఆత్మైవభారఇతితంత్వయియోనిధత్తే**

**సోఽఙ్గానికానికలయత్వలసఃప్రపత్తేః**

.

**విశ్వస్యసాక్షిణివిలక్షణలక్షణాయా**

**విస్రంభసంపదియమేవసమస్తమంగి**

.. **37** ..

**అన్వయంతో కూడిన ప్రతిపదార్థం:**

**ఆత్మా +ఏవ = జన్మపరంపరలలో కొనసాగేది, నాశంలేనిది అయిన జీవాత్మను నేను అనే భావనను. భారః ఇతి = భారమని తలచి, తం = దానిని యః = ఎవడు, త్వయి = నీయందు, నిధత్తే = అర్పించుకుంటాడు? (అతను దానిని మీవద్ద ఉంచుతాడు) సః అలసః = ఆ పని చేయలేనివాని (సోమరిపోతు) యొక్క, ప్రపత్తేః = గతి వేరేలేదని పాదములను పట్టుకొన శరణభావం, కానీ అంగాని = ఏ లక్షణాలతో, కలయతు = ఉంటాయని అనుకొంటారు? అత్ర (తు) = ఇచ్చట, విలక్షణ లక్షణా = ప్రత్యేక లక్షణంతో యా = ఏది, విస్రంభసంపత్ = పరిపూర్ణ విశ్వాస సంపద విశ్వస్య సాక్షిణి = విశ్వమునకు సాక్ష్యమైనది. (ఉన్నదో), ఇయమేవ = ఇదే, సమస్తమంగి = శరణాగతికి సంబంధించిన అన్ని భాగాలలో ముఖ్యమయినది.**

**తాత్పర్యం:**

**తల్లీ మీనాక్షీ! శరణాగతికి సంబంధించిన లక్షణాలను ఏ సోమరి గమనిస్తాడు? తనను తాను భారంగా భావించి తనను నీకు సమర్పించుకుంటాడా? (శరణాగతుల లక్షణాలలో ప్రధానమయిన ఆత్మనిక్షేపం సాధ్యపడదని కవిభావం). శరణాగతి అనేది 06 లక్షణాలతో సార్వత్రిక లోక మర్యాదను కలిగి ఉండవచ్చు, కానీ, నాకు సంబంధించి శరణాగతిలో అత్యున్నత విశ్వాసం యొక్క సంపద మాత్రమే సంపూర్ణతను కలిగి ఉంటుంది. (ఈ విశ్వాసం ఒక్కటే శరణాగతిలో అంగి. ఇతర లక్షణాలు శరణాగతిలో ఉన్నాయా లేవా అని విచారించవలసిన అవసరం లేదనేది శ్లోక తాత్పర్యం.)**

**విశేషాలు:**

**విశిష్టాద్వైతంలో శరణాగతి 06 రకాలు.**

''ఆనుకూల్యస్య సంకల్పం ప్రాతికూల్యస్య వర్జనం

రక్షిష్యతీతి విశ్వాసో, గోప్తృత్వవరణం తథా

ఆత్మనిక్షేప కార్పణ్యే షడ్విధాశ్శరణాగతిః''

(లక్ష్మీతంత్రమ్)

ఈ ఆరింటిలో ముఖ్యాతి ముఖ్యమైనది ఆత్మనిక్షేపం అని, దాన్ని అంగిగా గ్రహించి మిగిలిన అయిదింటిని అంగాలుగా గ్రహించాలని ఒక అభిప్రాయం ఉన్నది. (న్యాస దశకంలో శ్రీ వేదాంత దేశికులు)

తనకు (భక్తునకు) సంబంధించిన సర్వవిషయాలు, సర్వభారాలు దేవునివే అనే భావంతో సర్వేంద్రియ సర్వాత్మ సమర్పణంచేయడమే ఆత్మనిక్షేపం.

దీనిని కాదంటూ అద్వైతి అయిన నీలకంఠ దీక్షితులవారు విశ్వాసమే గొప్పదని ఈ శ్లోకంలో ప్రతిపాదించారు.

---

శ్లోకం 38

మాతః=తల్లీ ! మీనాక్షీ ! త్వత్ +ప్రేరణేన= నీప్రేరణముతో (నీసంకల్పంతో) మిషతః=నేనుపనులుచేస్తున్నాను,, శ్వసతః +అపి= జీవిస్తున్నానుకూఆచార్య . (శ్వాసతీసుకొంటున్నాను)

ప్రామాదికే=ప్రమాదవశాత్తు

, కర్మణిసతి అపి=నాపనిలోఏదయినానేనుతప్పుచేస్తే, మేనదోషః .=నేను దోషినికాను.

మాత్రా+ఏవ = తల్లియే,దత్తమ్

= ఇచ్చిన (తినిపించిన), అశనం = అన్నము.( అశ్నాతిభుంక్తేతస్యభావః] గ్రసతః = తినిన, శిశోఃసుతస్య = పసిపిల్లవానికి,( శ్యతిగర్భగ్గర్భమునుచీల్చునదికనుక శిశువనిపేరు)( సుతఃఉత్పన్నః పుట్టినవాడు ) . అతిభుక్తిదోషం= అతిగాతిన్నదోషమున్నదని,కఃనామవక్ష్యతి= ఎవడుచెప్పగలడు?

తాత్పర్యము:

తల్లీ! మీనాక్షీ! నీ ప్రేరణముతో నేను పనులు చేస్తున్నాను, శ్వాసతీసుకొంటున్నాను. అందువలన ప్రమాదవశాత్తు నా పనిలో ఏదయినా నేను తప్పుచేస్తే నేను దోషిని కాను. తల్లి తినిపించిన అన్నము తినే పసిపిల్లవానికి అతిగా తిన్న దోషమున్నదని ఎవడు చెప్పగలడు?

విశేషం:

పసిపిల్లవాడు అమ్మ ఎంత తినిపిస్తే అంత తింటాడు. నేను కూడా నువ్వు ఏది చేయిస్తే అది చేస్తాను. అతిగా తిన్న దోషము పిల్లవానికి రాదు. అలాగే తప్పుచేసిన ఫలితము నాకూ రాదని కవి చమత్కారం.

---

**శ్లోకం 39**

**ముక్తింనిసాధయిషతాంనిజయైవబుద్ధ్యా**

**ప్రారబ్ధకర్మభవతుప్రతిబన్ధహేతుః**

.

**త్వామేవసాధనతయాపిసమాశ్రితానాం**

**తుల్యంతదంబయదికస్తవవీరవాదః**

**.. 39 ..**

**అన్వయంతో కూడిన ప్రతిపదార్థం:**

**అంబ = తల్లీ! మీనాక్షీ! నిజయా = స్వంత, బుద్ధ్యాఏవ = బుద్ధిచేతనే, ముక్తిం = మోక్షమును, నిసాధయిషతాం = సాధించాలనుకొనేవారికి, ప్రారబ్ధకర్మ = శరీరమునెత్తించెడు కర్మవిశేషము. (ప్రారభతి ప్రాణినాం శరీర ఆదికంధర్మాధర్మ రూపం ఫలంచ - ధర్మాధర్మ కారణముగా శరీరము ఫలమునిచ్చునది) ప్రతిబన్ధహేతుః భవతు = అడ్డగింతకు కారణము కావచ్చు.**

**సాధనతయా = ముక్తి సాధన కొరకు సాధనముగా, త్వామేవ = నిన్నే, సమాశ్రితానాం అపి = ఆశ్రయించినవారి విషయములో, తత్ = అదే ప్రారబ్ధం, తుల్యంయది = సమానమే అయితే (అడ్డగిస్తుంటే), తవకః వీరవాదః = నీ ప్రత్యేక ప్రసంగానికి విలువ ఏముంది?**

**తాత్పర్యం:**

**తల్లీ! మీనాక్షీ! నిన్ను పూజించకుండా తమ స్వంత బుద్ధిచేతనే మోక్షమును సాధించాలనుకొనేవారికి ప్రారబ్ధకర్మ అడ్డగింతకు కారణము కావచ్చు. కాని ముక్తి సాధనముగా నిన్నే ఆశ్రయించిన నీ భక్తుల విషయములో కూడా అదే ప్రారబ్ధం అడ్డగిస్తుంటే ఇక నీ ప్రత్యేకత ఏముంది? (ప్రారబ్ధమును కూడా తొలగించి ముక్తి కలిగించమని, నీ శక్తిని నిరూపించుకొమ్మని మీనాక్షీ దేవికి భక్తుడు చేస్తున్న వేదుకోలు ఈ ప్రశ్నలో కనిపిస్తుంది).**

**విశేషాలు:**

**కర్మము 'ప్రారబ్ధము-ఆగామి- సంచితము' అని మూడు రకములు. పూర్వ జన్మములందు చేయబడిన ఫలమనుభవింపవలసియున్న కర్మ ''సంచితము''. అనుభవం ఆరంభమై ఈ శరీరమును కల్పించినది ''ప్రారబ్ధ కర్మ''.**

గతంలో చేయబడిన కర్మల వలన వచ్చే ఫలితం వర్తమానంలో అనుభవంలోనికి రావడమే ప్రారబ్ధమంటారు. ఈ శరీరముచే చేయబడుచు, ఇక మీద ఫలమును ఇచ్చేది ''ఆగామి'' కర్మ. విద్యచేత అనగా జ్ఞానముచేత ''సంచిత'' ''ఆగామి'' కర్మలు నశిస్తాయి గాని ప్రారబ్ధం అనుభవముచేతనే నశిస్తుంది. (వేదాంత పంచదశి)

విలుకాడు ఒక బాణమును వదలి వేరొక దానిని చేత బట్టి - మరికొన్నిటిని అమ్ముల పొదిలో పూని ఉన్నట్లుగా ఈ కర్మములుంటాయి. వదలిన బాణము వంటిది ప్రారబ్ధము. (ప్ర + అరబ్ధము) చేతిలో పట్టుకొని ఉన్న బాణము వంటిది ఆగామి. అమ్ములపొదిలో ఉన్న బాణములవంటిది సంచితము. చేతిలోనున్న బాణమును, అమ్ములపొదిలోనివానిని ప్రయోగించకుండ ఉండగలము. కాని వదలిన బాణమును నిలుపగలమా? అది తన లక్ష్యమును చేరి తీరుతుంది. అందువల్ల 'అనుభవముచే గాని ప్రారబ్ధకర్మము నశింపదు' అన్నారు. "ప్రారబ్ధం భోగతో నశ్యేత్!" ఏ కర్మ ఫలమును అనుభవించటానికి ఈ శరీరము ఏర్పడినదో - ఆ కర్మానుభవము సమాప్తము కానిదే ఈ శరీరము తొలగదు. ఆగామి సంచిత కర్మ ఫలములను అనుభవింపకుండ నివారించుకోవచ్చును. ప్రారబ్ధ కర్మ ఫలము నివారించుట ఎవరివల్లా వీలు కాదు. యోగి పుంగవుడు తన కడుపు నింపుకొనుటకై తానేమియు ప్రయత్నింపడు. ప్రారబ్ధకర్మ వశమున ఎవడో వచ్చి తన నోరు దెరచి - ఏమైన ఆహారము నోటిలో బెట్టిన దానిని మ్రింగును. (ఆత్మవిద్యావిలాసము) నీ భక్తుని ప్రారబ్ధమును తొలగించకపోతే నీ గొప్పతనమేమున్నదని ఈ శ్లోకంలో దీక్షితులవారు అమ్మదగ్గర మారాము చేస్తూ అడుగుతున్న పసిపిల్లవానిలా అడుగుతున్నారు.

---

శ్లోకం 40

ప్రారబ్ధకర్మగిరిజేభవదాశ్రితానా-

మన్యత్రసంక్రమయనాశయవాసమూలం

.

మర్త్యాశ్చఖల్వపివిషంవపుషిప్రసక్తం

సంక్రామయంతిపరతోఽపిచనాశయన్తి

.

అన్వయంతో కూడిన ప్రతిపదార్థం:

గిరిజే = ఓ కొండల పుత్రికా! తల్లీ! మీనాక్షీ! భవత్ +ఆశ్రితానాం = నిన్ను ఆశ్రయించిన భక్తులయొక్క, ప్రారబ్ధకర్మ = ప్రారబ్ధకర్మను, అన్యత్ర = వేరొకచోటికి, సంక్రమయ = సంక్రమింపచేయుము. వా = లేక, సమూలం నాశయ = మొదలుతో సహ నాశనముచేయుము.

**మర్త్యాః +చ = మానవులు కూడా, వపుషి ప్రసక్తం విషం అపి = శరీరములో కలిగిన విషమును, పరతః = భిన్నమైనవారికి, సంక్రామయంతి = సంక్రమింపచేయుదురు. అపిచ = మరియు, నాశయన్తిఖలు = నాశనముచేయుదురు కదా!**

**తాత్పర్యం:**

**ఓ కొండల పుత్రికా! తల్లీ! మీనాక్షీ! నిన్ను ఆశ్రయించిన భక్తులయొక్క ప్రారబ్ధకర్మను వేరొకచోటికి సంక్రమింపచేయుము. లేక మొదలుతో సహ నాశనముచేయుము. మానవులు కూడా శరీరములో కలిగిన విషమును భిన్నమైనవారికి సంక్రమింపచేయుదురు. లేదా నాశనముచేయుదురు కదా! (ఆ విధంగా నా ప్రారబ్ధమును తొలగించుమని భావం).**

**విశేషము:**

**ప్రారబ్ధ కర్మను గురించి విపుల వ్యాఖ్య 39వ శ్లోకంలో ఉన్నది.**

---

**శ్లోకం 41**

**త్వద్దర్శనశ్రవణచింతనవందనాది-**

**ష్వక్షాణిదేవివినియుజ్యయథాధికారం**

.

**రక్షేత్యసంఖ్యభవసంభృతయైవమైత్ర్యా**

**రుంధ్యాంయదిస్థిరమమూన్యధునైవనస్యుః**

.. **41** ..

**అన్వయంతో కూడిన ప్రతిపదార్థం:**

**దేవి = దుర్గా! తల్లీ! మీనాక్షీ! త్వత్ = నీయొక్క, దర్శన = రూపాన్ని చూచి, శ్రవణ = నీ మహిమలను విని, చింతన = నిన్ను ధ్యానిస్తూ, వందన+ఆదిషు = నిన్ను పూజిస్తూ - ఇలాంటి విషయాలలో, అక్షాణి = ఇంద్రియములు (అక్షము = చూచునది, వ్యాపించునది. దేనితో విషయం గ్రహింపబడునో అది. అక్ష్యతేవా అనేన] యథా+అధికారం = సముచితంగా, వినియుజ్య = ఉపయోగిస్తే, రక్ష ఇతి = అవి రక్షిస్తాయని, అసంఖ్యభవసంభృతయా = లెక్కలేనన్ని జన్మలలో మైత్ర్యాఏవ = నీతో నాకున్న పరిచయాన్ని సద్వినియోగం చేసుకుంటూ, (లెక్కలేనన్ని జన్మలలో ఏర్పడిన స్నేహం వల్ల) స్థిరం రుంధ్యాంయది = మొండిగా తొలగిపోవాలని బలవంతం చేస్తే, అమూని = ఈ ప్రారబ్ధ కర్మలు, అధునా+ఏవ, నస్యుః = ఇవి వెంటనే అదృశ్యమవుతాయి.**

**తాత్పర్యం:**

తల్లీ! మీనాక్షీ! నేను నీ రూపాన్ని చూస్తూ, నీ మహిమలను వింటూ, నిన్ను పూజిస్తూ, నిన్ను ధ్యానిస్తూ, అసంఖ్యాక జన్మలలో నీతో నాకున్న పరిచయాన్ని సద్వినియోగం చేసుకుంటూ, నా ఇంద్రియాలను సముచితంగా ఉపయోగిస్తే, ప్రారబ్ధ కర్మలు ఇప్పుడు కూడా అదృశ్యమవుతాయి.

---

శ్లోకం 42

త్రాతవ్యఏషఇతిచేత్కరుణామయిస్యా-

త్త్రాయస్వకింసుకృతదుష్కృతచింతయామే

.

కర్తుంజగత్తిరయితుంచవిశృంఖలాయాః

కర్మానురోధఇతికంప్రతివంచనేయం

.. 42

అన్వయం:

"ఏషః త్రాతవ్యః"ఇతి మయి కరుణా స్యాత్చేత్ త్రాయస్వ మే సుకృత దుష్కృత చింతయా కిమ్?

జగత్ కర్తుమ్ తిరయితుంచ విశృంఖలాయాః కర్మానురోధః ఇతి ఇయం వంచనా కం ప్రతి?

ప్రతిపదార్థం:

ఏషః = వీడు త్రాతవ్యః = రక్షించ తగినవాడు, ఇతి = అని, మయి = నాయందు, కరుణా = దయ, స్యాత్చేత్ = ఉన్నట్లయితే, త్రాయస్వ = నన్ను రక్షించు. మే = నాయొక్క, సుకృత దుష్కృత చింతయా = మంచి లేదా చెడు పనుల చింత, కిమ్ = నీకు ఎందుకు?

జగత్ కర్తుమ్ = ప్రపంచాన్ని సృష్టించుటకు, తిరయితుంచ = దాచివేయుటకు (నాశనంచేయుటకు) విశృంఖలాయాః = స్వేచ్ఛ కలిగిన నీదగ్గర కర్మ +అనురోధః ఇతి = కర్మ యొక్క అవరోధము ఉన్నదనే, ఇయం వంచనా = ఈ మోసము, కం ప్రతి = ఎవరి గురించి?

తాత్పర్యం:

తల్లీ మీనాక్షీ! వీడు రక్షించ తగినవాడు అని నాపై నీకు దయ ఉన్నట్లయితే నాయొక్క మంచి లేదా చెడు పనుల ఆలోచన నీకు ఎందుకు? ప్రపంచాన్ని సృష్టించుటకు నాశనంచేయుటకు సమర్థురాలివైన నీకు ప్రారబ్ధ కర్మలు - అవరోధాలు ఇవి ఒక లెక్కా? ఈ మోసము తగదు తల్లీ!

**విశేషాలు:**

అమ్మదగ్గర స్వేచ్ఛ కలిగిన కవి మాటలు ఇవి. తల్లిదగ్గర పిల్లవాడు ''నువ్వు అది చేస్తావు కాని, నాకు మాత్రం చేయవు. నన్ను మోసం చేస్తున్నావ్?'' అని లౌకికంగా గారాలు పోతున్న పద్ధతిలో - నువ్వు సృష్టించటానికి సమర్ధురాలివైనప్పుడు ఈ కర్మలు పోగొట్టడం ఒక లెక్క కాదని, నువ్వు మమ్మల్ని మాయలో పడేస్తున్నావని కవి ఆరోపణ.

**భాషా విశేషాలు:**

- సుకృతం - సుష్ఠు కృతం నిష్పాదితమ్ బాగుగా చేయబడ్డది. పుణ్యము; శుభకర్మ.
- దుష్కృతమ్ - దుష్టం కృతం కృతి చెడుపని; పాపము.
- విశృంఖల - విగతా శృంఖలా మార్గః వాయస్య] బంధములేనివాడు; స్వేచ్ఛగా తిరుగువాడు.

---

**శ్లోకం 43**

త్వయ్యర్పితంప్రథమమప్పయయజ్వనైవ

స్వాత్మార్పణంవిదధతాస్వకులంసమస్తం

.

కాత్వంమహేశికులదాసముపేక్షితుంమాం

కోవానుపాసితుమహంకులదేవతాంత్వాం

.. 43 .

**అన్వయం:**

మహేశి! ప్రథమమ్, స్వాత్మార్పణం విదధతా, అప్పయయజ్వనా ఏవ, త్వయి సమస్తం స్వకులం, అర్పితం, కులదాసమ్ మాం, ఉపేక్షితుం, కా త్వం, కులదేవతాం త్వాం, అనుపాసితుమ్, అహం కః వా?

**ప్రతిపదార్థం:**

మహేశి = ఓ మహేశ్వరీ! ప్రథమమ్ = మొదటగా, స్వ +ఆత్మ +అర్పణం విదధతా = నీకు తన ఆత్మార్పణమును చేసుకొన్న, అప్పయయజ్వనాఏవ = అప్పయ్య దీక్షితులే, త్వయి = నీయందు, సమస్తం స్వకులం = తనకు సంబంధించిన సమస్త వంశమును, అర్పితం = అర్పించాడు. (ఏవంస్థితే = ఇటువంటి స్థితిలో) కులదాసమ్ మాం = కులదాసుడనైన నన్ను, ఉపేక్షితుం = ఉపేక్షించుటకు, కాత్వం = నువ్వెవరు? కులదేవతాం త్వాం = కులదేవతవయిన నిన్ను, అనుపాసితుమ్ = ఉపాసించకుండా ఉండటానికి, అహం కః వా? = నేనెవరిని?

**తాత్పర్యం:**

**ఓ మహేశ్వరీ! తల్లీ! మీనాక్షీ! నీకు తన ఆత్మార్పణమును చేసుకొన్న, అప్పయ్య దీక్షితులే (అప్పయ్య దీక్షితుల సోదరుని మనుమడు నీలకంఠ దీక్షితులు) నీకు తనకి సంబంధించిన సమస్త వంశము యొక్క బాగోగులను అర్పించాడు. ఇటువంటి స్థితిలో కులమునకు దాసుడనైన నన్ను ఉపేక్షించుటకు నువ్వెవరు? కులదేవతవయిన నిన్ను ఉపాసించకుండా ఉండటానికి నేనెవరిని? (నన్ను నువ్వు రక్షించాలి. నిన్ను సేవించాలి. ఇది ఇద్దరికీ తప్పనిసరి పని అని కవిభావం).**

**విశేషాలు:**

**అప్పయ్య దీక్షితులవారి ఆత్మార్పణస్తుతి ప్రముఖమైనది. ఆ స్తుతిని అనువదించాను. చదవాలనే ఆసక్తి కలవారికి లంకె ఇది: https://drive.google.com/file/d/1ASCv9q79YUTbWYQqLkjye9t5-490W6wn/view**

---

**శ్లోకం 44**

**మౌఢ్యాదహంశరణయామిసురాంతరంచే-**

**త్కింతావతాస్వమపితస్యభవామిమాతః**

.

**అజ్ఞానతఃపరగృహంప్రవిశన్పరస్య**

**స్వత్వంప్రయాస్యతిపశుఃకిమురాజకీయః**

**.. 44 ..**

**అన్వయం:**

**మాతః! మౌఢ్యాత్ సురాంతరం అహం శరణయామిచేత్ తావతా తస్య స్వమపి కిం భవామి? అజ్ఞానతః పరగృహం ప్రవిశన్ రాజకీయః పశుః పరస్య స్వత్వం కిము ప్రయాస్యతి?**

**ప్రతిపదార్థం:**

**మాతః! = తల్లీ! మీనాక్షీ! మౌఢ్యాత్ = మూర్ఖత్వంతో, సుర +అంతరం = నిన్ను కాక మరొక దేవుడిని (దేవతను), అహం = నేను, శరణయామిచేత్ = ఆశ్రయిస్తే, తావతా = అందువలన, తస్య = అతనికి, స్వమ్ +అపి = సొమ్ముగా, కిం భవామి? = ఎందుకు అవుతాను? అజ్ఞానతః = అజ్ఞానము వలన, (తెలియకుండా) పరగృహం = మరొకరి ఇంట్లోకి, ప్రవిశన్ = ప్రవేశిస్తే, రాజకీయః పశుః = రాజ జంతువు, పరస్య స్వత్వం = మరొకరికి హక్కుగా, కిము ప్రయాస్యతి? = అవుతుందా ఏమిటి?**

**తాత్పర్యం:**

తల్లీ! మీనాక్షీ! అజ్ఞానం కారణంగా, నేను వేరే దైవం యొక్క రక్షణను కోరుకుంటే, నేను ఆ దైవానికి ఆస్తిగా మారతానా? రాజుకు చెందిన జంతువు (ఆవు) పొరబాటున మరొకరి ఇంట్లోకి ప్రవేశిస్తే, అది వారికి ఆస్తి అవుతుందా? (అనన్య శరణాగతితో వేరే దైవాన్ని కొలువక నిన్నే ప్రార్థిస్తానని భావం).

---

శ్లోకం 45

వసంతతిలకం

ఆధాయమూర్ధనివృథైవభరంమహాంతం

మూర్ఖానిమజ్జథకథంభవసాగరేఽస్మిన్

.

విన్యస్యభారమఖిలంపదయోర్జనన్యా

విస్రబ్ధముత్తరతపల్వలతుల్యమేనం

.. 45 ..

అన్వయం:

మూర్ఖాః! వృథైవ, మహాంతం, భరం, మూర్ధని, ఆధాయ, అస్మిన్, భవసాగరే, కథం, నిమజ్జథ?

అఖిలం భారం, జనన్యాః, పదయోః, విన్యస్య, పల్వల తుల్యమ్, ఏనం, విస్రబ్ధమ్, ఉత్తరత

ప్రతిపదార్థం:

మూర్ఖాః! = మూర్ఖులారా! వృథైవ = వృథాగా, మహాంతం భరం = గొప్పదయిన భారాన్ని, మూర్ధని = తలపై, ఆధాయ = ఉంచుకొని, అస్మిన్ భవసాగరే = ఈ సంసార సముద్రములో (జననమరణ సముద్రంలో) కథం నిమజ్జథ = ఎందుకు మునిగిపోతారు? అఖిలం భారం = మొత్తం భారాన్ని, జనన్యాః పదయోః = మీనాక్షి దేవి పాదాలపై, విన్యస్య = ఉంచి, పల్వల తుల్యమ్ = చిన్న సరస్సులా ఏనం = ఈ సముద్రాన్ని చేసి, విస్రబ్ధమ్ = శాంతితో, (తేలికపాటి హృదయంతో) ఉత్తరత = ఈ సంసారాన్ని దాటండి.

తాత్పర్యం:

మూర్ఖులారా! వృథాగా తలపై భారం వేసుకుని ఈ సంసార సముద్రములో (జననమరణ సముద్రంలో) ఎందుకు మునిగిపోతారు? నీ బరువంతా అమ్మ (మీనాక్షీ అమ్మవారు) పాదాల దగ్గర ఉంచి, ఈ సంసార సముద్రమును చిన్న సరస్సులా చేసి తేలికపాటి హృదయంతో దీన్ని దాటండి.

విశేషాలు:

అమ్మ పాదాల దగ్గర శరణువేడితే ఈ సంసార సముద్రాన్ని తేలికగా దాటగలమని భావం.

---

శ్లోకం 46

క్వేదంపతిష్యతివపుఃక్వతతోనుగమ్యం

కోదండయిష్యతికియంతమనేహసంవా

.

కింతస్యసంతరణసాధనమిత్యనంతా

చింతాస్థితాత్వయిశనైరవతారితాసా

.. 46 ..

అన్వయం:

ఇదం వపుః క్వ పతిష్యతి తతః క్వ నుగమ్యం కః దండయిష్యతి కియంతమ్ వా అనేహసమ్ తస్య సంతరణ సాధనమ్ కిమ్ ఇతి స్థితా సా అనంతా చింతా త్వయి శనైః అవతారితా

ప్రతిపదార్థం:

ఇదం వపుః = ఈ శరీరం, క్వ పతిష్యతి = ఎక్కడ పడిపోతుంది? తతః = అటుపిమ్మట, క్వ నుగమ్యం = నన్ను ఎక్కడికి తీసుకెళతారు? కః దండయిష్యతి = నన్ను ఎవరు శిక్షిస్తారు? వా = మరియు, కియంతమ్ అనేహసమ్ = ఎంత కాలము పాటు (అనేహసమ్ = న హన్యతే శాశ్వతమైనది, నశింపనిది = కాలము) తస్య = దానిని సంతరణ సాధనమ్ = అధిగమించు సాధనము కిమ్ = ఏది? ఇతి స్థితా = ఇలా ఉన్న ప్రశ్నలతోపాటు సా = ఆ విషయంలో, అనంతా చింతా = అనంతమైన ఆలోచనలు, త్వయి = నీయందు, శనైః = మెల్లగా, అవతారితా = అవతరింపచేయబడ్డావు. (కొద్దికొద్దిగా నా బాధలన్నింటినీ మీతో చెప్పానని భావం).

తాత్పర్యం:

ఈ శరీరం ఎక్కడ పడిపోతుంది? అటుపిమ్మట నన్ను ఎక్కడికి తీసుకెళతారు? నన్ను ఎవరు శిక్షిస్తారు? ఎంత కాలము పాటు నాకు ఈ శిక్ష? దానిని అధిగమించు సాధనము ఏది? ఇలా ఉన్న ప్రశ్నలతోపాటు ఆ విషయంలో అనంతమైన ఆలోచనలు నాలో ఉన్నాయి. కొద్దికొద్దిగా ఆ ఆలోచనల బాధలన్నింటినీ నీతో చెప్పానని భావం.

విశేషాలు:

ఈ ఆలోచనలన్నీ నీ పాదసన్నిధికి చేర్చానని, అన్నింటికి నువ్వే సమాధానమగుదువని, ఆమెనే శరణు కోరాలని తల్లి మీనాక్షికి కవిపుత్రుని నివేదన.

---

శ్లోకం 47

జ్ఞానందిశేయముతతేనవినోద్ధరేయం

ప్రారబ్ధమప్యపలపేయముతానురుంధ్యాం

.

ఇత్థంసకృత్ప్రపదనైకవశంవదాయా

మాతుర్మయిప్రవవృతేమహతీహచింతా

.. 47 ..

అన్వయం:

మాతుః జ్ఞానం, దిశేయమ్, ఉత, తేనవినా, ఉద్ధర ఇయం, ప్రారబ్ధమ్, అపి అపలపేయమ్, ఉత, అనురుంధ్యామ్ .

ఇత్థం, సకృత్ప్రదనైకవశంవదాయాః, ఇహ, మహతీ చింతా, మయి, ప్రవవృతే

ప్రతిపదార్థం:

ఇయమ్ జ్ఞానం దిశ = ఈ జ్ఞానాన్ని చూపించుము, ఉత = లేదా, తేనవినా = అది లేకుండా, ఇయం ఉద్ధర = ఉద్ధరించుము, ఇయమ్ ప్రారబ్ధమ్ అపి = ఈ ప్రారబ్ధము కూడా, అపలప = కప్పిపుచ్చి చెప్పుము, ఉత = లేదా, అనురుంధ్యామ్ = మీరు అంగీకరించగలరా? ఇత్థం = ఈ విధంగా, సకృత్ ప్రదనైక వశం వదాయాః = ఒకరకమైన స్వీయ శరణాగతి (మాకు) దయ ద్వారా ఇవ్వబడింది, ఇహ = ఇక్కడ, మహతీ చింతా = గొప్పదయిన ఆలోచన మయి = నాయందు మాతుః = తల్లికి, ప్రవవృతే = సంభవించింది.

తాత్పర్యం:

దీక్షితులవారు తనను మీనాక్షి అనుగ్రహించిందని తనలో తాను భావిస్తూ ఆ చేష్టలను వర్ణిస్తున్నారు. ‘‘నేను ఒకసారి వేడుకున్నప్పుడు, అమ్మ నాపై కనికరంతో కదిలిపోయింది. ఆమె నాకు జ్ఞానాన్ని ఇవ్వాలా లేదా ఆ ప్రక్రియ లేకుండా నన్ను ఉద్ధరించాలా? నా ప్రారబ్ధాన్ని పరిపాలించాలా? వద్దా?’’ అని తనలో తాను నా తల్లి మీనాక్షి ఆత్రుతగా ఆలోచించడం ప్రారంభించింది. ఆమె స్వేచ్ఛకు అందరూ కట్టుబడి ఉండవలసినదే.

---

**శ్లోకం 48**

**వసంతతిలకం**

**ఏతజ్జడాజడవివేచనమేతదేవ**

**క్షిత్యాదితత్వపరిశోధనకౌశలంచ**

.

**జ్ఞానంచశైవమిదమాగమకోటిలభ్యం**

**మాతుర్యదంఘ్రియుగలేనిహితోమయాత్మా**

.. **48** ..

**అన్వయం:**

**యత్ జడ +అజడ వివేచనమ్ ఇదం ఏతత్ +ఏవ చ క్షితి + ఆదితత్వ పరిశోధన కౌశలం ఏతత్ ఆగమ కోటి లభ్యం శైవం జ్ఞానం ఏవ చ మయా మాతుః అంఘ్రి యుగలే ఆత్మా నిహితః**

**ప్రతిపదార్థం:**

**యత్ = ఏది అయితే, జడ +అజడ వివేచనమ్ = కదిలీ కదలని జీవుల మధ్య భేదాన్ని తెలుసుకొనే శక్తి ఉన్నదో, ఇదమ్ = ఈ, క్షితి + ఆదితత్వ పరిశోధన కౌశలం = భూమి మరియు ఇతర తత్వాల యొక్క విభిన్న స్వభావాలను పరిశీలించడంలో నైపుణ్యం ఉన్నదో, (తత్త్వములను లెక్కించు సాంఖ్య శాస్త్ర నైపుణ్యం) చ = మరియు, ఏతత్ ఆగమ కోటి లభ్యం = అనేక ఆగమాలను శోధించడంద్వారా పొందిన, ఏతత్ శైవం జ్ఞానం ఏవ చ = ఈ శివజ్ఞానము కూడా మయా = నాచేత మాతుః = తల్లి అయిన మీనాక్షియొక్క అంఘ్రి యుగలే = పాదపద్మముల దగ్గర, ఆత్మా నిహితః = ఉంచబడినది.**

**తాత్పర్యం:**

**కదిలీ కదలని జీవుల మధ్య భేదాన్ని తెలుసుకొనే శక్తి, భూమి మరియు ఇతర తత్వాల యొక్క విభిన్న స్వభావ పరిశీలనా శక్తి, (తత్త్వములను లెక్కించు సాంఖ్య శాస్త్ర నైపుణ్యం) అనేక ఆగమాలను శోధించడంద్వారా పొందే శివజ్ఞానము ఇవన్నీ - నాచేత తల్లి అయిన మీనాక్షియొక్క పాదపద్మముల దగ్గర ఉంచబడినది.**

**విశేషాలు:**

1. **కవి జగన్మాతయొక్క చరణాలలో తన ఆత్మను సమర్పించాడు. అది సాంఖ్యం (శుద్ధాత్మ తత్వజ్ఞానం) శైవాగమం మొదలైన శాస్త్రాలను కవి నేర్చుకున్న ఫలితం.**

2. 36 తత్త్వాలు శైవ శాస్త్రములలో పరించబడ్డాయి. శంకర భగవత్పాదుల వివేకచూడామణిలో అవి ఇలా ఉన్నాయి. 1. శివుడు, 2. శక్తి, 3. సదాశివుడు, 4. ఈశ్వరుడు, 5. శుద్ధవిద్య, 6. కాలము, 7. నియతి, 8. కలి, 9. అవిద్య, 10. రాగము, 11. పురుషుడు, 12. ప్రకృతి, 13. గుణము, 14. బుద్ధి, 15. అహంకారము, 16. చిత్తము, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు [చూ. పంచ ఇంద్రియములు], పంచభూతములు, పంచతన్మాత్రలు. [వివేకచింతామణి 3 పరి.]

3. శైవాగమాలు 28. శివ తత్త్వరత్నాకరములో అవి ఇలా ఉన్నాయి.

4. కామికము, 2. యోగజము, 3. చింత్యము, 4. కారణము, 5. అజితము, 6. దీప్తము, 7. సూక్ష్మము, 8. సహస్రము, 9. అంశుమాన్, 10. సుప్రభ (సుప్రభేద)ము [ఇవి శివ పరములు], 11. విజయము, 12. నిశ్వాసము, 13. స్వాయంభువము, 14. ఆగ్నేయకము, 15. భద్రము, 16. రౌరవము, 17. మకుటము, 18. విమలము, 19. చంద్రహాసము, 20. మఖయుగ్బింబము, 21. ఉద్గీతము, 22. లలితము, 23. సిద్ధము, 24. సంతానము, 25. నారసింహము (సర్వోక్షము-సర్వోత్తరము), 26. పరమేశ్వరము, 27. కిరణము, 28. పరము (వాతూలము) [ఇవి రుద్రపరములు] [శివతత్త్వరత్నాకరము 19 పే]

---

శ్లోకం 49

షట్త్రింశదావరణమధ్యజుషిత్వదంఘ్రౌ

హాలాస్యనాథదయితేనిహితోమయాత్మా

.

భూభూతలత్రిదశవర్తిషుకఃక్షమేత

తచ్చక్షుషాపినిభృతేననిరీక్షితుంమాం

.. 49 ..

అన్వయం:

హాలాస్యనాథదయితే! షట్త్రింశత్+ఆవరణమధ్యజుషి, త్వత్+అంఘ్రౌ, మయా, ఆత్మా నిహితః, తత్, భూభూతలత్రిదశవర్తిషు నిభృతేన, చక్షుషా, మాం నిరీక్షితుం అపి, కః క్షమేత

ప్రతిపదార్థం:

హాలాస్యనాథదయితే = మధురైనాథుడయిన శివుని భార్యా! నాతల్లీ! మీనాక్షీ! , షట్త్రింశత్ +ఆవరణమధ్యజుషి = ముప్పై ఆరు తత్వాల మధ్య ఆనందించే, త్వత్ +అంఘ్రౌ = నీ పాదముల మధ్య, మయా = నాచేత ఆత్మా నిహితః = నా జీవాత్మ

**ఉంచబడినది, తత్ = ఆ, భూభూతలత్రిదశవర్త్తిషు = భూమిలోను, స్వర్గములోను తిరుగాడు, నిభృతేన చక్షుషా = నిశ్చలమైన కన్నులతో, మాం = నన్ను, నిరీక్షితుం అపి = బాగా చూచుటకు కూడా, కః క్షమేత = ఎవడు ఓర్చుకోగలడు?**

**తాత్పర్యం:**

**ముప్పై ఆరు తత్త్వాల కవచాల నడుమ కూర్చున్న అమ్మవారి చరణాలలో ఆధ్యాత్మిక సేవ చేస్తున్న నన్ను మూడు లోకాలలో ఎవరు కళ్లు తెరిచి చూడగలరు? (తన భక్తి ఎలాంటిదో కవి విశదీకరించాడు).**

**విశేషాలు:**

**36 తత్త్వాలు శంకర భగవత్పాదుల వివేక చూడామణిలో ఉన్నాయి. వాటిని గురించి 48వ శ్లోక వివరణలో వివరించబడినది.**

---

**శ్లోకం 50**

**బంధంహరిష్యసిసుఖంవితరిష్యసీతి**

**నిశ్చప్రచంనిఖిలమంబతదాస్తఏవ**

.

**సంప్రత్యహంత్వయినిధాయభరంసమస్తం**

**యన్నిర్వృణోమికిమితోఽపిమమాపవర్గే**

.. **50** ..

**అన్వయం:**

**అంబ, బంధం, హరిష్యసి, సుఖం వితరిష్యసి + ఇతి, తత్, నిఖిలమ్, నిశ్చప్రచం, ఆస్తఏవ, సంప్రతి, అహం, సమస్తం భరం, త్వయి నిధాయ, యత్ +నిర్వృణోమి, ఇతః +అపి, మమ, అపవర్గే, కిమ్**

**ప్రతిపదార్థం:**

**అంబ = తల్లీ! మీనాక్షీ! బంధం హరిష్యసి = బంధాలనుండి విడిపించి (దుఃఖాలను తొలగించి), సుఖం వితరిష్యసి = శాశ్వతమైన ఆనందము ఇస్తావు, ఇతి = అని ఏ విషయమైతే ఉన్నదో, తత్ నిఖిలమ్ = అదంతా, నిశ్చప్రచం = నిశ్చయింపబడినది, వృద్ధిపొందినది. (నిశ్చితంచ ప్రచితంచ = 'నిశ్చప్రచమ్ ) ఆస్తఏవ = అది అంతా ముందుగానే మీచే నిర్ణీతముగా ఉన్నది. (అస్థాతువు లజ్ మధ్యమ పురుష బహువచనం) సంప్రతి = ఇప్పుడు, అహం = నేను, సమస్తం భరం**

**= నా సమస్త భారాన్ని, త్వయి నిధాయ = మీపై మోపుతున్నాను, యత్ = ఏది, మమ, అపవర్గే = నా మోక్షంలో కూడా, ఇతః +అపి = ఇంతకంటే కూడా, నిర్వృణోమి కిమ్ = గొప్ప ఆనందాన్ని పొందగలనా అని నాకు సందేహం.**

**తాత్పర్యం:**

**తల్లీ! మీనాక్షీ! నిన్నే నమ్ముకొన్న నా భక్తుడనయిన నా దుఃఖాలను తొలగించి, సుఖాన్ని ఇచ్చినన్ను తప్పకుండా కాపాడతావు. అందుకే ఏది జరిగితే అది జరగనీ అని నా సమస్త భారాన్ని నీపై మోపుతున్నాను. మోక్షంలో ఇంతకంటే గొప్ప ఆనందాన్ని పొందగలనా అని నాకు సందేహం. (మోక్షంలో ఇంతకంటే గొప్ప ఆనందాన్ని పొందనని, మీనాక్షిని మనసారా నమ్మితే శాశ్వతానందం లభిస్తుందని కవిభావం).**

---

**శ్లోకం 51**

**కాశ్యాంనిపాతయవపుఃశ్వపచాలయేవా**

**స్వర్గంనయత్వమపవర్గమధోగతింవా**

.

**అద్యైవవాకురుదయాంపునరాయతౌవా**

**కఃసంభ్రమోమమధనేధనినఃప్రమాణం**

.. **51** ..

**అన్వయం:**

**త్వమ్, వపుః, కాశ్యాం నిపాతయ, వా, శ్వపచాలయే, స్వర్గం నయ, అపవర్గమ్, (నయ) వా అధోగతిం, అద్యైవ, వా పునః ఆయతౌవా, మమ కః సంభ్రమః, ధనే, ధనినః ప్రమాణం**

**ప్రతిపదార్థం:**

**త్వమ్ = తల్లీ! మీనాక్షీ! నువ్వు వపుః = నా శరీరానికి (వుప్యంతే దేహాంతరభోగసాధనబీజీభూతాని కర్మాణి అత్ర దేహాంతరభోగసాధనకు బీజభూతములైన కర్మలు వుండునది కనుక శరీరాన్ని వపువు అంటారు) కాశ్యాం = కాశీలో (కాశతే ప్రకాశతే శివేన శివుని వలన ప్రకాశించునది కనుక కాశీ అని పేరు) నిపాతయ = మరణాన్ని ఇచ్చినాసరే! (నిపాత = నికృష్టపాతః నీచైః పతనమ్ అధోగతి చెందించుట మరణము.) వా = లేక శ్వపచాలయే = చండాలుని ఇంటిలో మరణాన్ని ఇచ్చినాసరే! స్వర్గం నయ = నన్ను స్వర్గానికి చేర్చినా, వా = లేక అపవర్గమ్ = మోక్షం ఇచ్చినాసరే! (అపవర్గః దానం ముక్తిర్వా; అపవృజ్యతే సంసారః ముచ్యతే అనేన మోక్షము) అధోగతిం = నరకంలో పడవేసినాసరే, అద్య +ఏవ = ఇప్పుడు (నాపై మరణపు దాడిచేసినా) వా = లేక పునః ఆయతౌ = చాలాకాలము తరువాత అయినాసరే (మరణపు దాడిచేయవచ్చు) మమ**

= నాకు కః సంభ్రమః = సంభ్రమమేమున్నది? (నేను పట్టించుకోను) ధనే = తన ధనమునందు (ఆస్తిపై) ధనినః = యజమానికి ప్రమాణం = ప్రమాణమున్నది. (హక్కు ఉన్నది. ఇష్టానుసారం ఆస్తిని ఉపయోగించుకోవచ్చు.)

**తాత్పర్యం:**

తల్లీ! మీనాక్షీ! నువ్వు నాకు కాశీలో మరణాన్ని ఇచ్చినా, లేదా చండాలుని ఇంటిలో మరణాన్ని ఇచ్చినా, నన్ను స్వర్గానికి చేర్చినా, నాకు మోక్షం ఇచ్చినా, నరకంలో పడవేసినా, ఈరోజు నాపై మరణపు దాడి చేసినా, చాలా కాలంతర్వాత నన్ను మరణింపచేసినా, నేను పట్టించుకోను. నేను నీ ఆస్తిని. నువ్వు నా యజమానివి. యజమాని తన ఇష్టానుసారం ఆస్తిని ఉపయోగించుకోవచ్చు.

**విశేషాలు:**

తాను అమ్మవారి ఆస్తిని అని కవి వ్యంగ్యంగా తన స్థాయి చెబుతున్నాడు.

---

**శ్లోకం 52**

**నాహంసహేతవకథాశ్రవణాంతరాయం**

**నాహంసహేతవపదార్చనవిచ్యుతింవా**

.

**మోక్షందిశైతదవిరుద్ధమిదంనచేత్స్యా-**

**న్నైవాస్తుమాతరపవర్గమహోపసర్గః**

..

**అన్వయం:**

మాతః తవ కథాశ్రవణ +అంతరాయం అహం న సహే వా తవ పదార్చన విచ్యుతిం అహం న సహే ఏతత్ అవిరుద్ధమ్ మోక్షందిశ ఇదం న చేత్ స్యాత్ అపవర్గ మహోపసర్గః నైవ అస్తు

**ప్రతిపదార్థం:**

మాతః = తల్లీ! మీనాక్షీ! తవ = నీయొక్క, కథాశ్రవణ +అంతరాయం = కథను వింటున్నప్పుడు ఎవరైనా అంతరాయం కలిగిస్తే, అహం = నేను, న సహే = ఓర్చుకోలేను. వా = లేదా, తవ పద +అర్చన విచ్యుతిం = నీ పాదములను పూజించుటలో నాశము (అనగా ఆటంకము) కలిగిస్తే అహం = నేను, న సహే = ఓర్చుకోలేను. ఏతత్ అవిరుద్ధమ్ = వీటికి విరుద్ధం కాకుండా,

మోక్షం = మోక్షమును, దిశ = ఇమ్ము, ఇదం న చేత్ స్యాత్ = ఒకవేళ ఇలా సాధ్యం కాకపోతే, అపవర్గ = మోక్షమును, మహా +ఉపసర్గః = మహోపద్రవము, న +ఏవ అస్తు = నాకు కలుగకుండా ఉండుగాక!

తాత్పర్యం:

తల్లీ! మీనాక్షీ! నీయొక్క కథను వింటున్నప్పుడు ఎవరైనా అంతరాయం కలిగిస్తే నేను ఓర్చుకోలేను. అలాగే నీ పాదములను పూజించు సందర్భములో ఎవరైనా ఆటంకము కలిగిస్తే నేను ఓర్చుకోలేను. ఈ రెండింటికి విరుద్ధం కాకుండా మోక్షమును ఇమ్ము. ఒకవేళ పై రెండింటిని (కథాశ్రవణము, పాదార్చనము) ఇవ్వటం సాధ్యం కాకపోతే మోక్షము నాకు ఇవ్వవద్దు. నీ కథాశ్రవణము, నీ పాదార్చనములు లేని మోక్షము నాకు మహోపద్రవము లాంటిది.

విశేషాలు:

అందరూ మోక్షము గొప్పదంటారు. కాని దీక్షితులవారు మోక్షము కంటె అమ్మవారి కథాశ్రవణము, అమ్మవారి పాదార్చనము గొప్పదంటున్నారు. అమ్మవారి కథాశ్రవణము, అమ్మవారి పాదార్చనములతో కూడిన మోక్షము కావాలంటున్నారు. ఈ ఊహ దీక్షితుల భక్త్యతిశయాన్ని తెలుపుతుంది.

---

శ్లోకం 53

వసంతతిలకం

ఆచూడమాచరణమంబతవానువార-

మంతఃస్మరన్భువనమంగలమంగమంగం

.

ఆనందసాగరతరంగపరంపరాభి-

రాందోలితోనగణయామిగతాన్యహాని

.. 53 ..

అన్వయం:

అంబ, ఆచూడమ్, ఆచరణమ్, భువనమంగలమ్, తవ, అంగమ్ అంగమ్, అనువారమ్, అంతఃస్మరన్, ఆనందసాగరతరంగపరంపరాభిః, ఆందోలితః, గతాని +అహాని, న గణయామి

ప్రతిపదార్థం:

**అంబ = తల్లీ! మీనాక్షీ! ఆచరణమ్ = పాదములనుండి ఆచూడమ్ = తలవరకు, భువనమంగలమ్ = లోకములకు శుభమును కలిగించు, తవ = నీయొక్క, అంగమ్ = అవయవములను, అనువారమ్ = అనేక మార్లు, అంతఃస్మరన్ = నా మనస్సులో స్మరించుచూ, ఆనందసాగరతరంగపరంపరాభిః = ఆనంద సముద్రపు అలల పరంపరలతో ఆందోలితః = ఊగింపబడిన (నాకు), గతాని +అహాని = ఎన్ని రోజులు గడచిపోయాయో, న గణయామి = లెక్కపెట్టలేకున్నాను.**

**తాత్పర్యం:**

**తల్లీ! మీనాక్షీ! నీ దివ్య స్వరూపాన్ని తలనుండి పాదము వరకు ధ్యానిస్తూ కూర్చున్న నాకు ఎన్ని రోజులు గడచిపోయాయో తెలియటంలేదు. నేను ఆనంద సాగరంలో మునిగిపోయాను.**

**విశేషాలు:**

**దేవతల స్వరూపాన్ని పాదములు మొదలు కేశాంతముల వరకు, అలాగే మానవ స్వరూపమును కేశములు మొదలు పాదాంతముల వరకు వర్ణించుట కవితా లోకంలో ఒక సాంప్రదాయం. "ఆచూడమాచరణమంబ" అని శ్లోకమున్నప్పటికి అన్వయంలో ఆచరణమ్, ఆచూడమ్ అని గ్రహించుట సముచితం.**

---

**శ్లోకం 54**

**వసంతతిలకం**

**పాషాణతోఽపికఠినేశిరసిశ్రుతీనాం**

**ప్రాయఃపరిభ్రమవశాదివపాటలాభం**

.

**అంబస్మరేయమమృతార్ణవమాథలబ్ధ-**

**హైయంగవీనసుకుమారమిదంపదంతే**

.. **54** ..

**అన్వయం:**

**అంబ! అమృత +అర్ణవ, మాథ లబ్ధ హైయంగవీన, సుకుమారమ్, పాషాణతః అపి, కఠినే, శ్రుతీనాం, శిరసి, ప్రాయః, పరిభ్రమవశాత్ ఇవ, పాటల +ఆభం, ఇదం, తే, పదం, స్మరేయమ్**

**ప్రతిపదార్థం:**

అమృత +అర్ణవ = పాల సముద్రాన్ని మాథ = చిలుకుటవలన, లబ్ధ = పొందబడిన, హైయంగవీన = వెన్నలా (హ్యః గోదోహస్య దుగ్ధస్య నిన్నటి పాలు చిలుకుటతో వచ్చినది. వెన్న) సుకుమారమ్ = సున్నితంగా ఉండే, తే = నీ పదం = పాదములను, స్మరేయమ్ = స్మరిస్తాను. పాషాణతః అపి = (పాషయతి స్థూలోభవతి లావుగా వుండునది. రాయి.) రాయికంటే, కఠినే కఠినమైన, శ్రుతీనాం శిరసి = ఉపనిషత్తులలో, ప్రాయః = తరుచుగా, పరిభ్రమవశాత్ ఇవ = సంచారముచేయుటవలన, పాటల +ఆభం = తెలుపును మించిన ఎరుపు కలిగిన, ఇదం తే = ఈ నీ, పదం = పాదములను, స్మరేయమ్ = స్మరిస్తాను. (స్మృ ధాతువు విధిలిజ్ ఉత్తమ పురుష ఏకవచనం)

తాత్పర్యం:

అమ్మా! మీనాక్షీ! పాల సముద్రాన్ని మథించడం వల్ల జన్మించిన వెన్నలా సున్నితంగా ఉండే నీ పాదాన్ని నేను ధ్యానిస్తాను. రాతికంటే కఠినమైన వేదాల శీర్షములైన ఉపనిషత్తులలో తరుచుగా నువ్వు సంచరించటం వలన తెలుపును మించిన ఎరుపు కలిగిన నీ పాదములను స్మరిస్తాను.

విశేషాలు:

అమ్మవారియొక్క పాదములను, వేదములయొక్క, శీర్షములైన వేదాంతములు, లేదా ఉపనిషత్తులు తలపై పూవుగా, ధరిస్తున్నాయని సౌందర్యలహరి చెప్పింది. (84 వ శ్లోకం) "ఉపనిషదుద్యాన కేళికలకంఠి"గా ఉపనిషత్తులను అమ్మవారు సంచరించే ఉద్యానవనంతో నిత్య ప్రార్థనా శ్లోకం పోల్చి చెబుతుంది. (ఓంకార పంజర) కాని ఈ శ్లోకంలో దీక్షితులవారు ఉపనిషత్తును రాయికంటే కఠినమని చెప్పారు. (బహుశా వాటిని అర్థం చేసుకోవటంలో ఉపనిషత్తు రాయికంటే కఠినమని కవి భావనేమో!)

---

శ్లోకం 55

యేనామసంతికతిచిద్గురవిస్త్రిలోక్యాం

తేషామపిస్వయముపేతవతాగురుత్వం

.

పాదేనమూర్ధ్ని విధృతేనవయంతవాంబ

సంసారసాగరమిమంసుఖముత్తరామః

.. 55 .

---

శ్లోకం 56

**సాధారణేస్మరజయేనితిలాక్షిసాధ్యే**

**భాగీశివోభజతునామయశఃసమగ్రం**

.

**వామాంఘ్రిమాత్రకలితేజననిత్వదీయే**

**కావాప్రసక్తిరపికాలజయేపురారేః**

.. **56** ..

---

**శ్లోకం 57**

**వసంతతిలకవృత్తం**

**స్యాత్కోమలంయదిమనోమమవిశ్వమాతః**

**తత్పాదయోర్మృదులయోస్తవపాదుకాఽస్తు**

.

**స్యాత్కర్కశంయదికరగ్రహణేపురారేః**

**అశ్మాధిరోపణవిధౌభవతూపయోగః**

.. **57** ..

**అన్వయం:**

**విశ్వమాతః మమ మనః యది కోమలం స్యాత్ తత్ తవ మృదులయోః పాదయోః పాదుకా +అస్తు .**

**కర్కశం యది స్యాత్ పురారేః కర గ్రహణే అశ్మ అధిరోపణ విధౌ ఉపయోగః భవతు**

**ప్రతిపదార్థం:**

**విశ్వమాతః = ప్రపంచానికి తల్లీ! మీనాక్షీ! మమ మనః = నా మనసు, యది కోమలం స్యాత్ = మృదువుగా అనిపిస్తే తత్ = దానిని, తవ = నీయొక్క, మృదులయోః పాదయోః = మెత్తని పాదాలకు పాదుకా +అస్తు = చెప్పులుగా ఉండుగాక!**

**కర్కశం యది స్యాత్ = ఒకవేళ నా మనస్సు కఠినమనిపిస్తే, పురారేః = (పురస్య త్రిపురస్య అరిః] త్రిపురములకు శత్రువయిన శివుడనియొక్క, కరగ్రహణే = వివాహ సమయంలో, అశ్మ అధిరోపణ విధౌ = రాతిపైకి ఉంచే కార్యక్రమంలో, ఉపయోగః భవతు = ఉపయోగపడుగాక!**

తాత్పర్యం:

ప్రపంచానికి తల్లీ! మీనాక్షీ! నా మనసు నీకు మృదువుగా అనిపిస్తే దానిని నీ పాదాలకు చెప్పులుగా వాడుకో. ఒకవేళ నా మనస్సు కఠినమనిపిస్తే, శివునితో నీ వివాహ సమయంలో రాతిపైకి ఉంచే కార్యక్రమంలో నా మనస్సు ఉపయోగపడుగాక!

విశేషాలు:

వివాహ సమయంలో వరుడు వధువుచేత, ఆమె పాదాన్ని రాతిపైకి ఎక్కించుట ఒక విధి. 'అశ్మారోహణ మంత్రం' వరుడు ఇలా చెబుతాడు:

ఆతిష్ఠేమమశ్మానమశ్మేవత్వగ్స్థిరోభవ|

అభితిష్ఠపృతన్యతస్సహస్వపృతనాయతః||

ఇమం = ఈ, అశ్మానం = రాతిని, ఆతిష్ఠ = ఎక్కుమా. త్వం = నీవు, అశ్మేవ = రాయివలెనే, స్థిరః = చిరకాలజీవిగా, భవ = యతః = ఏ హేతువు వలన, పృతనాః = స్నేహితులు; పృతన్యతః = యుద్ధము చేయ కోరిక గలవారిలో ఆ హేతువు వలన సేనలను, అభితిష్ఠ = ఎదుర్కొనుము, సహస్వ = జయింపుము. అరాతిలాగా తన మనస్సును ఉంచుమనుటలో దీక్షితులవారి కవిత్వపు చమత్కారం ఉన్నది. ''పసుపు నూరుకొను పాత్రమునకు ఆధారమైన సన్నికల్లు అతి దృఢముగా ఉంటుంది. అలాంటి కఠినమైన దానిపై శివుడు తన వివాహ వేళలో అమ్మవారి సుతిమెత్తని పాదములను ఏవిధముగా ఉంచాడో'' అని శంకర భగవత్పాదులు సౌందర్యలహరిలో చేసిన వర్ణన (88వ శ్లోకం) ఈ సందర్భంలో స్మరణీయమైనది.

---

శ్లోకం 58

మదనవృత్తం

ప్రస్నిగ్ధముగ్ధరుచిపాదతలేభవత్యాః

లగ్నందృఢంయదిహమేహృదయారవిందం

.

ఏష్వైవసాగ్రభువనద్విశతీపతిత్వ-

సామ్రాజ్యసూచనకరీతవపద్మరేఖా

.. 58 ..

అన్వయం:

భవత్యాః, ప్రస్నిగ్ధముగ్ధరుచిపాదతలే, ఇహ మే హృదయ +అరవిందం, యత్ దృఢం లగ్నం, ఏషా +ఏవ, తవ, సాగ్రభువనద్విశతీపతిత్వసామ్రాజ్యసూచనకరీ పద్మరేఖా

ప్రతిపదార్థం:

భవత్యాః = నీయొక్క, ప్రస్నిగ్ధ = బాగా నునుపుగల, ముగ్ధరుచి = చక్కని కాంతి కలిగిన, పాదతలే = పాదాల అరికాళ్లకు, ఇహ = ఇప్పుడు, మే = నాయొక్క, హృదయ +అరవిందం = నా మనసు అనే కమలము, యత్ దృఢం లగ్నం = బాగా దృఢముగా అతుక్కొంటే, ఏషా +ఏవ = ఇదే, తవ = నీయొక్క, స +అగ్రభువనద్విశతీపతిత్వసామ్రాజ్యసూచనకరీ = రెండు వందలకంటే ఎక్కువ లోకాలకు ఆధిపత్యం కలిగిన చక్రవర్తియోగాన్ని సూచించగలిగిన, పద్మరేఖా = పద్మరేఖగా (మారుతుంది).

తాత్పర్యం:

తల్లీ! మీనాక్షీ! బాగా నునుపుగల చక్కని కాంతి కలిగిన నీ పాదాల అరికాళ్లకు, నాయొక్క మనసు అనే కమలము బాగా దృఢముగా అతుక్కొంటే - రెండు వందలకంటే ఎక్కువ లోకాలకు ఆధిపత్యం కలిగిన చక్రవర్తియోగాన్ని సూచించగలిగిన పద్మరేఖగా మారుతుంది.

విశేషాలు:

శైవ గ్రంథాలలో 200 లోకాలున్నట్లుగా ప్రసిద్ధి. అమ్మవారి భక్తుడయితే, హృదయపూర్వకంగా ప్రార్థిస్తే అధికార సంప్రాప్తి జరుగుతుందని ఈ శ్లోకభావం.

---

శ్లోకం 59

మదనవృత్తం

అప్రాకృతమ్మృదులతామవిచింత్యకించి-

దాలంబితాసిపదయోఃసుదృఢంమయాయత్

.

తన్మేభవార్ణవనిమజ్జనకాతరస్య

మాతఃక్షమస్వమధురేశ్వరిబాలకృత్యం

.. 59 ..

---

**శ్లోకం 60**

**మదనవృత్తం**

**యత్రానమన్పశుపతిఃప్రణయాపరాధే**

**మందంకిలస్పృశతిచంద్రకలాంచలేన**

.

**పుష్పార్చనేఽపిమృదితంపదయోర్యుగంత-**

**న్మాతస్తుదంతినకథంపరుషాగిరోమే**

.. **60** ..

**అన్వయం:**

**మాతః ప్రణయాపరాధే యత్ర ఆనమన్ పశుపతిః చంద్రకలాంచలేన మందం స్పృశతి కిల**

**పుష్ప +అర్చనే అపి మృదితం తత్ పదయోః యుగం పరుషాః మే గిరః కథం న తుదన్తి**

**ప్రతిపదార్థం:**

**మాతః = తల్లీ! మీనాక్షీ! యత్ర = ఎచ్చట, ప్రణయ +అపరాధే = ప్రేమము యొక్క కుటిల ప్రచారము వలన కారణము లేకయే నీకు కలిగిన కోపమును (పొలయలుక) పోగొట్టటానికి ఆనమన్ = నమస్కరిస్తూ, పశుపతిః = స్థావర జంగమములకు పతి అయిన శివుడు [పశూనాం స్థావర జంగమానాం పతిః] చంద్రకల +అంచలేన = నెలవంక చివరతో మందం = మందముగా స్పృశతి కిల = స్పర్శింపబడుచున్నది కదా!**

**పుష్ప +అర్చనే అపి = భక్తులు పూల పూజ చేసేటప్పుడు, మృదితం = అణచబడినది అయిన తత్ పదయోః యుగం = ఆ నీ పాద పద్మములను పరుషాః = పరుషములైన (కఠోరమైనవి), మే గిరః = నా మాటలు కథం = ఎట్లు, న తుదన్తి = కొట్టకుండా (బాధపెట్టకుండా) ఉంటాయా?**

**తాత్పర్యం:**

**తల్లీ! మీనాక్షీ! నీ ప్రణయపు అలుక పోగొట్టటానికి శివుడు నమస్కరించే సమయంలో ఆయన నెత్తిమీద ఉన్న నెలవంక తగిలి నీ పాదాలు నొప్పి పుట్టి ఉంటాయి. భక్తులు పూజ చేసేటప్పుడు వాళ్లు విసిరే పూలతో సుకుమారమైన నీ పాదాలకు నొప్పి తగిలి ఉంటుంది. వీటికితోడు ఇప్పుడు ఈ భక్తుడు ఈ శ్లోకార్చనలు చేస్తూ తన పరుషపు మాటలను నీ పాదాల దగ్గర పెడుతున్నాడు. ఇవి కూడా నీకు నొప్పి కలిగిస్తాయి. నన్ను మన్నించు.**

మీరు అందించిన ఆనందసాగరస్తవములోని శ్లోకాలకు ప్రతిపదార్థం, తాత్పర్యం, విశేషాలతో కూడిన వివరణ క్రింద ఇవ్వబడింది. ప్రతి శ్లోకాన్ని ఛందస్సు ప్రకారం నాలుగు పాదాలుగా విభజించి, టైపింగ్ తప్పులు సరిదిద్దబడ్డాయి.

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 61**

**అవ్యాజసుందరమనుత్తరమప్రమేయ-**

**మప్రాకృతం పరమమంగలమంఘ్రిపద్మం |**

**సందర్శయేదపి సకృద్భవతీ దయార్ద్రా**

**ద్రష్టాస్మికేన తదహం తు విలోచనేన || 61 ||**

---

**ప్రతిపదార్థం**

**అవ్యాజసుందరం — సహజంగానే, అందమైన; అనుత్తరమ్ — మించినదిలేని; అప్రమేయమ్ — కొలవశక్యంకాని; అప్రాకృతమ్ — లోకసంబంధమైనది కాని; పరమమంగలమ్ — అత్యంత శుభప్రదమైన; అంఘ్రిపద్మం — పాదపద్మాన్ని; భవతీ — దేవి; దయార్ద్రా — దయతో తడిసినదై; సకృత్ — ఒకసారి; సందర్శయేత్ అపి — దర్శనం ఇచ్చినా; తత్ — దానిని; అహం — నేను; కేన — ఏ; విలోచనేన — కళ్ళతో; ద్రష్టాస్మి తు — చూడగలను కదా!**

---

**తాత్పర్యం**

**సహజంగానే అందమైన, సాటిలేని, కొలవశక్యంకాని, లోకాతీతమైన, అత్యంత శుభప్రదమైన నీ పాదపద్మాన్ని ఓ దేవీ! దయతో తడిసినదానవై ఒకసారి దర్శనం ఇచ్చినా, నేను దానిని ఏ కళ్ళతో చూడగలను?** (అంటే, నా అపవిత్రమైన కళ్ళతో నీ దివ్యమైన పాదపద్మాన్ని చూడడం అసాధ్యం, నీ అనుగ్రహం లేనిదే దర్శనం కలగదు అని భావం).

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 62**

**మదనవృత్తం**

**దివ్యాదృశోఽపి దివిషద్గ్రహణోచితాని**

**వస్తూని కామమవధారయితుం క్షమంతే |**

**త్వన్మాత్రవేద్యవిభవే తవ రూపధేయే**

**త్వద్భావ ఏష శరణం పరిశేషితో నః || 62 ||**

---

**అన్వయం**

**దివ్యాదృశః అపి దివిషద్గ్రహణ+ఉచితాని వస్తూని అవధారయితుం కామం క్షమంతే. త్వన్మాత్రవేద్యవిభవే తవరూపధేయే ఏషః త్వద్భావః నః శరణం పరిశేషితః.**

---

**ప్రతిపదార్థం**

**దివ్యాదృశః — దివ్యమైన దృష్టిగలవారు; అపి — కూడా; దివిషద్గ్రహణ+ఉచితాని — దేవతలు గ్రహించదగిన, వారికి తగిన; వస్తూని — వస్తువులను; అవధారయితుం — తెలుసుకోవడానికి; కామం — కోరికతో; క్షమంతే — సమర్థులవుతారు; త్వన్మాత్రవేద్యవిభవే — నీకు మాత్రమే తెలియదగిన మహిమ కలిగిన; తవ — నీ; రూపధేయే — రూపం విషయంలో; ఏషః — ఈ; త్వద్భావః — నీయందు భక్తిభావం; నః — మాకు; శరణం — శరణ్యంగా; పరిశేషితః — మిగిలి ఉన్నది.**

---

**తాత్పర్యం**

**దివ్యదృష్టి కలిగినవారు సైతం దేవతలు చూడగలిగే వస్తువులను మాత్రమే గ్రహించగలరు. నీ మహిమను కేవలం నువ్వు మాత్రమే తెలుసుకోగలవు. నీ రూపం విషయంలో, నీయందు భక్తి భావం కలిగి ఉండటం ఒక్కటే మాకు మిగిలిన శరణ్యం. దైవిక దృష్టి కూడా స్వర్గవాసులు చూడగలిగే విషయాలను మాత్రమే గ్రహించగలదు. నీ రూపాన్ని చూసే విషయంలో, దాని మహిమకు నువ్వు మాత్రమే సాక్షిగా ఉండగలవు. నీవే కావాలని ప్రార్థించాల్సిన ఏకైక మార్గం మాకు ఉంది.**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 63**

**మదనవృత్తం**

**అస్మిన్మహత్యనవధౌ కిల కాలచక్రే**

**ధన్యాస్తు యే కతిపయే శుకయోగిముఖ్యాః |**

**లీనాస్త్వదంఘ్రియుగలే పరిశుద్ధసత్వాన్**

**తానాత్మనస్తవ నఖానవధారయామః || 63 ||**

---

**అన్వయం**

**అనవధౌ మహతి అస్మిన్ కాలచక్రే పరిశుద్ధసత్త్వాః శుకయోగిముఖ్యాః యే కతిపయే తత్+అంఘ్రియుగలే లీనాః కిల తే తు ధన్యాః తాన్ ఆత్మనః తవ నఖాన్ అవధారయామః.**

---

**ప్రతిపదార్థం**

**అనవధౌ — అవధిలేని; మహతి — మహత్తరమైన; అస్మిన్ కాలచక్రే — ఈ కాలచక్రంలో; పరిశుద్ధసత్త్వాః — పరిశుద్ధమైన సత్త్వగుణము కలిగిన; శుకయోగిముఖ్యాః — శుకయోగి మొదలయినవారు; యే కతిపయే — ఏ కొద్దిమంది అయితే ఉన్నారో (వారు); తత్+అంఘ్రియుగలే — నీ దయిన పాదములయందు; లీనాః కిల — లీనమయి ఉన్నారు కదా!; తే తు — ఆ; ధన్యాః — ధన్యులు; తాన్ — వారిని; ఆత్మనః — వారి ఆత్మలతో; తవ నఖాన్ — నీ పాదాల గోళ్ళ కాంతుల రూపంలో మెరుస్తున్నారని; అవధారయామః — మేము నమ్ముతున్నాము.**

---

**తాత్పర్యం**

**ఈ మహత్తరమైన, అంతంలేని కాలచక్రంలో, పరిశుద్ధ సత్త్వగుణులైన శుకయోగి మొదలైన కొద్దిమంది నీ పాదాలలో లీనమైపోయారు. వారు నిజంగా ధన్యులు. వారి ఆత్మలు నీ కాలిగోళ్ల రూపంలో మెరుస్తున్నాయని మేము నమ్ముతున్నాము.**

---

**విశేషాలు**

- **సత్త్వం: సత్త్వరజస్తమోగుణాలలో మొదటిది. జ్ఞానం, మంచితనం మొదలైన అర్థాలు ఉన్నాయి.**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 64**

**ఆశైశవాన్మమతయా కలితస్త్వయా సా-**

**వానృణ్యమంబ తవ లబ్ధుమనా మృగాంగకః |**

**స్వాత్మానమేవ నియతం బహుధా విభజ్య**

**త్వత్పాదయోర్వినిదధే నఖరాపదేశాత్ || 64 ||**

---

**ప్రతిపదార్థం**

అంబ — అమ్మా!; ఆశైశవాత్ — బాల్యం నుండి; త్వయా — నీచేత; మమతయా — మమకారంతో; కలితః — ఆలింగనం చేయబడిన; సః అసౌ — ఆ (చంద్రుడు); మృగాంగకః — చంద్రునిలో ఉన్న జింక చిహ్నం; తవ — నీ; ఆనృణ్యమ్ — రుణవిముక్తిని; లబ్ధుమనాః — పొందాలనే కోరికతో; నియతమ్ — నిశ్చయంగా; స్వాత్మానమేవ — తనను తానే; బహుధా — అనేక విధాలుగా; విభజ్య — విభజించుకుని; త్వత్పాదయోః — నీ పాదాల వద్ద; నఖరాపదేశాత్ — గోళ్ల సాకుతో; వినిదధే — సమర్పించుకున్నాడు.

---

తాత్పర్యం

అమ్మా! బాల్యం నుండి నువ్వు మమకారంతో ఆలింగనం చేసుకున్న చంద్రునిలోని మృగ చిహ్నం, నీ ఋణం తీర్చుకోవాలనే కోరికతో, తనను తానే అనేక విధాలుగా విభజించుకుని, నీ పాదాల వద్ద గోళ్ల సాకుతో సమర్పించుకున్నాడు. (చంద్రునిలో కనిపించే మచ్చ, అమ్మవారి పాదాల గోళ్లుగా కవి భావన).

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 65

నాంతఃప్రవేశమయతే కిమపి శ్రుతం మే

నాస్తిక్యవాదశిలయా ప్రతిరుధ్యమానం |

తత్పాతయామ్యహమిమాం మహతీమధస్తా-

త్పాదోదకేన కియతా పరదేవతాయాః || 65 ||

---

ప్రతిపదార్థం

మే — నాచే; కిమపి — ఏది కూడా; శ్రుతం — వినబడినది; నాస్తిక్యవాదశిలయా — నాస్తికత్వం అనే బండరాయిచేత; ప్రతిరుధ్యమానం — అడ్డుకోబడినదై; అంతఃప్రవేశమ్ — లోపలి ప్రవేశమును; న అయతే — పొందడం లేదు; తత్ — కాబట్టి; అహమ్ — నేను; ఇమామ్ — ఈ; మహతీం — గొప్పదైన; నాస్తిక్యవాదశిలయా — నాస్తికత్వం అనే బండరాయిని; పరదేవతాయాః — పరదేవత యొక్క; కియతా — ఎంత కొద్దిపాటి; పాదోదకేన — పాదజలంతో; అధస్తాత్ — క్రిందికి; పాతయామి — పడగొడతాను.

---

తాత్పర్యం

నాస్తికత్వం అనే బండరాయి నా మనస్సులోకి ఏ మంచి మాటనీ ప్రవేశించనీయకుండా అడ్డుకుంటోంది. కాబట్టి, ఓ పరదేవతా! నీ పాదాల నుండి జాలువారే కొద్దిపాటి జలంతోనైనా ఈ గొప్ప నాస్తికత్వ బండరాయిని నా మనస్సు నుండి పడగొడతాను. (అంటే, దేవి పాదోదక మహిమతో నాలోని నాస్తికత్వాన్ని తొలగించుకుంటాను అని భావం).

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 66

సన్నాహిభిః యమభటైః పరివార్యమాణే

మయ్యర్భకే కరుణయా స్వయమాపతంత్యాః |

ఆకర్ణయేయమపినామ విరామకాలే

మాతస్తవాంఘ్రిమణినూపురశింజితాని || 66 ||

---

ప్రతిపదార్థం

మాతః — అమ్మా!; సన్నాహిభిః — సిద్ధంగా ఉన్న; యమభటైః — యమదూతలచే; పరివార్యమాణే — చుట్టుముట్టబడిన; అర్భకే మయి — చిన్నవాడనైన నా దగ్గర; కరుణయా — దయతో; స్వయమ్ — స్వయంగా; ఆపతంత్యాః — వస్తున్న నీయొక్క; విరామకాలే — (ప్రాణ)వియోగ సమయంలో; తవ — నీ; అంఘ్రిమణినూపురశింజితాని — పాదాలలోని మణుల నూపుర శబ్దాలను; ఆకర్ణయేయమ్ అపి నామ — వినగలుగుతానా?

---

తాత్పర్యం

అమ్మా! యమదూతలు నన్ను చుట్టుముట్టగా, నా ప్రాణం పోయే సమయంలో, దయతో స్వయంగా నా వద్దకు వస్తున్న నీ పాదాలలోని మణుల నూపుర ధ్వనులను వినగలుగుతానా? (అంటే, మరణ సమయంలో అమ్మవారి దర్శనం, ఆమె నూపుర శబ్దాలు వినే భాగ్యం కలగాలి అని ప్రార్థన).

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 67

బ్రహ్మేశకేశవముఖైర్బహుభిః కుమారైః

పర్యాయతః పరిగృహీతవిముక్తదేశం |

ఉత్సంగమంబ తవ దాస్యసి మే కదా త్వం

**మాతృప్రియం కిల జడం సుతమామనంతి || 67 ||**

---

**ప్రతిపదార్థం**

**అంబ — అమ్మా!; బ్రహ్మేశకేశవముఖైః — బ్రహ్మ, ఈశ్వరుడు, కేశవుడు మొదలైన; బహుభిః — అనేక మంది; కుమారైః — కుమారులచే; పర్యాయతః — వంతులవారీగా; పరిగృహీతవిముక్తదేశం — స్వీకరించి, విడిచిపెట్టబడిన ప్రదేశం కలిగిన; తవ — నీ; ఉత్సంగమ్ — ఒడిని; త్వం — నువ్వు; మే — నాకు; కదా — ఎప్పుడు; దాస్యసి — ఇస్తావు?; మాతృప్రియం — తల్లికి ప్రియమైనవాడుగా; కిల — నిజంగా; జడం — మూర్ఖుడైన; సుతమ్ — కుమారుడిని; ఆమనంతి — భావిస్తారు.**

---

**తాత్పర్యం**

**అమ్మా! బ్రహ్మ, ఈశ్వరుడు, విష్ణువు మొదలైన అనేకమంది కుమారులు వంతులవారీగా వచ్చి, వెళ్ళిపోయిన నీ ఒడిని నువ్వు నాకు ఎప్పుడు ఇస్తావు? తల్లికి ఎప్పుడూ తన మూర్ఖుడైన కుమారుడే అత్యంత ప్రియమైనవాడని అంటారు కదా! (అంటే, నేను మూర్ఖుడనైనప్పటికీ, నీకు ప్రియుడినే కనుక, నీ ఒడిలో చేర్చుకో అని ప్రార్థన).**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 68**

**మదనవృత్తం**

**ఊరౌ శిరస్తవ నివేశ్య దయావితీర్ణ-**

**సంవ్యానపల్లవసమీరవినీతఖేదం |**

**అత్రైవ జన్మని విభోః పరమోపదేశ-**

**మాకర్ణయేయమపి కిం మణికర్ణికాయాం || 68 ||**

---

**అన్వయం**

**దయావితీర్ణసంవ్యానపల్లవసమీరవినీతఖేదం శిరః తవ ఊరౌ నివేశ్య అత్ర జన్మని ఏవ విభోః పరమఉపదేశం మణికర్ణికాయాం కిం ఆకర్ణయేయమ్ +అపి.**

---

**ప్రతిపదార్థం**

**దయావితీర్ణ — దయతో ఇయ్యబడిన; సంవ్యాన — వస్త్రము; పల్లవ — చిగురు (లేదా చిన్న); సమీర — గాలితో; వినీత — త్రోయబడిన; ఖేదం — విచారము కలవాడినై; శిరః — తల; తవ ఊరౌ — నీ ఒడిలో; నివేశ్య — ఉంచి; అత్ర జన్మని ఏవ — ఈ జన్మలోనే; విభోః — పరమశివునియొక్క; పరమఉపదేశం — ఆత్మవిముక్తి కలిగించే సంభాషణను; మణికర్ణికాయాం — మణికర్ణికలో; కిం ఆకర్ణయేయమ్ +అపి — వినగలనా?**

---

**తాత్పర్యం**

**తల్లీ! మీనాక్షీ! కాశీలో మరణించినవారికి ప్రాణం పోయేటప్పుడు శివుడు చెవిలో తారకమంత్రాన్ని ఉపదేశిస్తాడని గ్రంథాలు చెబుతున్నాయి కదా! అటువంటి పుణ్యకాశీక్షేత్రంలో మణికర్ణికలో నా ప్రాణవియోగ కాలంలో, నన్ను నీ ఒడిలో పెట్టుకుని నా మరణభయ విచారాలను నువ్వు పోగొడుతుండగా, శివుడు చెవిలో తారకమంత్రాన్ని ఉపదేశిస్తుండగా వినే భాగ్యము నాకు ఉన్నదా? (ఆ అదృష్టాన్ని కలుగజేయమని ప్రార్థన).**

---

**విశేషాలు**

- **(మణికర్ణిక అనేది బెనారస్‌లోని విశ్వేశ్వర ఆలయానికి ఎదురుగా గంగానదిలో ఉన్న స్నానఘట్టము.)**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 69**

**కాంచీగుణగ్రథితకాంచనచేలదృశ్య-**

**చండాతకాంశుకవిభాపరభాగశోభి |**

**పర్యంకమండలపరిష్కరణంపురారేః**

**ధ్యాయామితే విపులమంబ నితంబబింబం || 69 ||**

---

**ప్రతిపదార్థం**

**అంబ — అమ్మా!; కాంచీగుణగ్రథిత — మొలనూలు దారాలతో అల్లబడిన; కాంచనచేలదృశ్య — బంగారు చీరతో కనిపించే; చండాతకాంశుకవిభా — సూర్యకాంతి వంటి కాంతితో; పరభాగశోభి — వెనుక భాగం ప్రకాశించే; పురారేః — శివునికి; పర్యంకమండలపరిష్కరణమ్ — మంచం అలంకరణ వంటి; తే — నీయొక్క; విపులమ్ — విశాలమైన; నితంబబింబం — పిరుదుల మండలాన్ని; ధ్యాయామి — ధ్యానిస్తున్నాను.**

---

తాత్పర్యం

అమ్మా! నీ మొలనూలు దారాలతో అల్లబడిన బంగారు చీర, సూర్యకాంతి వలె ప్రకాశిస్తూ, నీ వెనుక భాగాన్ని అద్భుతంగా శోభింపజేస్తోంది. శివునికి మంచం అలంకరణ వంటి నీ విశాలమైన పిరుదుల మండలాన్ని నేను ధ్యానిస్తున్నాను.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 70

గర్భే నివేశ్య భువనాని చతుర్దశాపి

సంరక్షితుం కలితనిశ్చితయా భవత్యా |

ప్రాకారమేవ రచితం పరితోఽపి నూన-

మూహే సువర్ణమయమేదురపట్టబంధం || 70 ||

---

ప్రతిపదార్థం

భవత్యా – నీచే; చతుర్దశాపి – పదునాలుగు కూడా; భువనాని – లోకాలను; గర్భే – గర్భంలో; నివేశ్య – ఉంచుకుని; సంరక్షితుం – రక్షించడానికి; కలితనిశ్చితయా – నిశ్చయించుకున్న దానవై; పరితః అపి – చుట్టూ కూడా; నూనమ్ – నిజంగా; సువర్ణమయమేదురపట్టబంధం – బంగారుమయమైన దట్టమైన పట్టు పట్టీల కట్టుతో; రచితం – నిర్మించబడిన; ప్రాకారమ్ ఏవ – ప్రాకారాన్ని (కోట గోడను) వలె; ఊహే – ఊహిస్తున్నాను.

---

తాత్పర్యం

పదునాలుగు లోకాలను నీ గర్భంలో ఉంచుకుని రక్షించడానికి నిశ్చయించుకున్న దానవై నువ్వు, వాటి చుట్టూ బంగారుమయమైన, దట్టమైన పట్టు పట్టీల కట్టుతో నిర్మించిన కోట గోడ వలె ప్రకాశిస్తున్నావు.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 71

మదనవృత్తం

ముక్తాశ్చ ఖల్వపి యది త్రిపురే భవత్యాః

స్తన్యాశయా స్తనతటం న పరిత్యజంతి |

అస్మాకముద్భటభవజ్వరతాపితానాం-

మార్ద్రీభవన్తు వదనాని కుతో న హేతోః || 71 ||

---

ప్రతిపదార్థం

త్రిపురే – త్రిపురాసురులలో; ముక్తాః – ముక్తి పొందినవారు; ఖలు అపి – నిజంగా కూడా; భవత్యాః – నీయొక్క; స్తన్యాశయా – పాలు తాగాలనే కోరికతో; స్తనతటం – వక్షస్థలాన్ని; న పరిత్యజంతి యది – వదలిపెట్టకపోతే; ఉద్భటభవజ్వరతాపితానాం – తీవ్రమైన సంసార జ్వరం చేత వేధించబడిన; అస్మాకమ్ – మా యొక్క; వదనాని – ముఖాలు; కుతః న – ఎందుకు కాదు; హేతోః – కారణం లేకుండానే; ఆర్ద్రీభవన్తు – తడిసిపోవుగాక (పొంగిపోవుగాక).

---

తాత్పర్యం

తల్లీ! త్రిపురాసురులలో ముక్తి పొందినవారు కూడా నీ పాలు తాగాలనే ఆశతో నీ వక్షస్థలాన్ని వదిలిపెట్టకపోతే, తీవ్రమైన సంసార జ్వరం చేత పీడింపబడిన మా ముఖాలు కారణం లేకుండానే ఎందుకు తడిసిపోకూడదు? (అంటే, నీ కరుణతో మా ముఖాలు సంతోషంతో వెలిగిపోవాలి అని ప్రార్థన).

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 72

మదనవృత్తం

నష్టోపలబ్ధమధిగత్య శిశుం చిరాన్మాం

వాత్సల్యవిద్రుతహృదః పరదేవతాయాః |

క్లిద్యత్పయోధరవినిఃసృతదుగ్ధబిందు-

నిష్యందపంక్తిరివ దీవ్యతి హారయష్టిః || 72 ||

---

ప్రతిపదార్థం

చిరాత్ – చాలాకాలంగా; నష్ట+ఉపలబ్ధమ్ +అధిగత్య – అక్షరపూజ చేయక తిరిగి పొందిన; మాం శిశుం – ఈ నీ బిడ్డను; వాత్సల్యవిద్రుతహృదః – వాత్సల్యంతో కరిగిపోయిన హృదయము కలిగిన; పరదేవతాయాః – అమ్మవారి యొక్క; క్లిద్యత్

— తడిసిన; పయోధర — (వక్షస్థలం నుండి); వినిఃసృత — బయటికి కారుచున్న; దుగ్ధబిందునిష్యందపంక్తిః +ఇవ — కారుతున్న పాల బిందువుల రేఖలాగా; హారయష్టిః — ముత్యాల హారం; దీవ్యతి — ప్రకాశించుచున్నది.

---

తాత్పర్యం

అమ్మా! మీనాక్షీ! చాలాకాలంగా నీకు అక్షరపూజ చేయటంలేదు కదా! ఈరోజే నీ దగ్గరికి వచ్చాను. చాలాకాలంగా దూరంగా ఉన్న నన్ను తిరిగి నీ దగ్గరికి తీసుకున్నావు. చాలాకాలంగా దూరంగా ఉన్న కొడుకు ఒక్కసారిగా దగ్గరికి రావడంతో నీ హృదయం వాత్సల్యంతో కరిగిపోయింది. అందువల్ల నాపై వాత్సల్యంతో నీ వక్షస్థలం నుండి కారుతున్న పాల బిందువుల రేఖలాగా, నీ వక్షస్థలంపై నువ్వు ధరించిన ముత్యాల హారం ప్రకాశిస్తున్నది.

---

విశేషము

- అమ్మవారి అక్షరపూజకు అత్యవసర పుస్తకరచన వలన దూరమయి, ఈరోజు (21-04-23) తిరిగి మొదలుపెట్టబోతుండగా, వరుసలో అనువాదం చేయవలసిన ఈ ఆనందసాగరస్తవ శ్లోకం నా పరిస్థితికి అద్దం పడుతూ కనిపించింది. ఇది యాదృచ్ఛికమా? అమ్మవారి అనుగ్రహమా? దేవ్యై నమః

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 73

యత్తద్ధనుర్జనమనోమయమైక్షవంతే

తస్యాస్తు దేవి హృదయం మమ మూలదేశః |

చాపాధిరోపణవిధౌ చరణాంచలేన

సంభావ్యతే కిల సమాక్రమణం కదాచిత్ || 73 ||

---

ప్రతిపదార్థం

దేవి — దేవీ!; జనమనోమయమ్ — ప్రజల మనస్సుతో కూడిన; యత్ తత్ — ఏదైతే అది; ధనుః — ధనుస్సుగా; ఐక్షవంతే — భావించబడుతుందో; తస్య — ఆ ధనుస్సు యొక్క; మూలదేశః — మూలభాగం; మమ — నా; హృదయం — హృదయం; అస్తు — అగుగాక!; చాపాధిరోపణవిధౌ — విల్లును ఎక్కుపెట్టే విధానంలో; చరణాంచలేన — పాదము యొక్క చివరి భాగంతో (లేదా వ్రేలితో); కిల — నిజంగా; కదాచిత్ — ఎప్పుడైనా; సమాక్రమణం — అధిరోహించడం; సంభావ్యతే — సంభవిస్తుంది.

---

**తాత్పర్యం**

**ఓ దేవీ! ప్రజల మనస్సుగా భావించబడే నీ ధనుస్సు యొక్క మూలభాగం నా హృదయం అగుగాక! విల్లును ఎక్కుపెట్టేటప్పుడు పాదంతో (లేదా వ్రేలితో) అధిరోహించడం సంభవిస్తుంది కదా! (అంటే, నా హృదయాన్ని నీ ధనుస్సు యొక్క మూలభాగంగా భావించి, దానిని నీ పాదాలతో అధిరోహించి, నీ కరుణాకటాక్షాలను ప్రసాదించు అని భావం).**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 74**

**మదనవృత్తం**

**ఆస్థాయ దారుణతరం కమపి స్వభావ-**

**మత్యంతదుష్కృతకృతామపి శిక్షణాయ |**

**గృహ్ణాసి సాయకపదే కుసుమాన్యమూని**

**మాతః సుతేషు మహతీ కిల రూక్షతేయం || 74 ||**

---

**అన్వయం**

**మాతః అత్యంతదుష్కృతకృతామ్ అపి (మీ పిల్లలను) శిక్షణాయ దారుణతరం కమపి స్వభావమ్ ఆస్థాయ అమూని కుసుమాని సాయకపదే గృహ్ణాసి సుతేషు ఇయం రూక్షతా మహతీ కిల.**

---

**ప్రతిపదార్థం**

**మాతః – తల్లీ! మీనాక్షీ!; అత్యంతదుష్కృతకృతామ్ అపి – ప్రపంచాన్ని నాశనం చేసే అత్యంత ఘోరమైన పనులు చేసినప్పటికీ, (మీ పిల్లలను); శిక్షణాయ – శిక్షించడానికి; దారుణతరం – భయంకరమైన; కమపి స్వభావమ్ – కొద్దిగా స్వభావాన్ని (కోపాన్ని); ఆస్థాయ – పాటిస్తూ; అమూని కుసుమాని – ఈ పూలను; సాయకపదే – బాణస్థానములో; గృహ్ణాసి – స్వీకరిస్తున్నావు; సుతేషు – కుమారులయందు; ఇయం – ఈ విధమైన; రూక్షతా – పరుషత్వము; మహతీ కిల – గొప్పదికదా!**

---

**తాత్పర్యం**

తల్లీ! మీనాక్షీ! తల్లికి పిల్లలపై కోపం వస్తుంది కానీ వారిని ఎక్కువగా శిక్షించాలని అనిపించదు. అత్యంత ఘోరమైన పనులు చేసి ప్రపంచాన్ని నాశనం చేసినప్పటికీ, అటువంటి నీ పిల్లలను శిక్షించడానికి, నువ్వు భయంకరమైన కోపంతో నిండి ఉన్నప్పటికీ, నీ బాణాల స్థానంలో పువ్వులను ఉపయోగిస్తావు. తల్లీ! ఇది నిజంగా వారిపై గొప్ప కఠిన స్వభావనిరూపణత్వం - కాదా? (కఠినత్వం కాదని అమ్మకి ప్రేమ అధికమని, అందుకే బాణాలకు బదులు పువ్వులను ఉపయోగిస్తుందని అంతరార్థం).

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 75

పాశం సృణించ కరయోస్తవ భావయంతః

సంస్తంభయంతి వశయంతి చ సర్వలోకాన్ |

చాపం శరంచ సకృదంబ తవ స్మరంతో

భూపాలతాం దధతి భోగపథావతీర్ణః || 75 ||

---

ప్రతిపదార్థం

తవ – నీ; కరయోః – చేతులలో; పాశం – పాశమును (తాటిని); సృణించ – అంకుశమును; భావయంతః – ధ్యానించువారు; సర్వలోకాన్ – సమస్త లోకాలను; సంస్తంభయంతి – స్తంభింపజేస్తారు; చ – మరియు; వశయంతి – వశపరచుకుంటారు; అంబ – అమ్మా!; తవ – నీ; చాపం – విల్లును; శరంచ – బాణాన్ని; సకృత్ – ఒకసారి; స్మరంతః – స్మరించేవారు; భోగపథావతీర్ణః – ఐశ్వర్య మార్గంలో ప్రవేశించి; భూపాలతాం – రాజుల పదవిని; దధతి – పొందుతారు.

---

తాత్పర్యం

అమ్మా! నీ చేతులలో పాశమును, అంకుశమును ధ్యానించేవారు సమస్త లోకాలను స్తంభింపజేసి, వశపరచుకుంటారు. నీ విల్లును, బాణాన్ని ఒక్కసారి స్మరించేవారు ఐశ్వర్య మార్గంలో ప్రవేశించి రాజుల పదవిని పొందుతారు.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 76

వసంతతిలకవృత్తం

పాశాంకుశౌ తవ కరే పరిచింత్య రాగ-

ద్వేషౌ జయంతి పరమార్థవిదస్తు ధన్యాః |

**ఏకత్ర చాపమితరత్ర శరంచ మత్వా**

**వ్యావర్తయంతి హృదయం విషయాంధకూపాత్ || 76 ||**

---

**అన్వయం**

**ధన్యాః పరమార్థవిదః తు తవ కరే పాశ+అంకుశౌ పరిచింత్య రాగద్వేషౌ జయంతి ఏకత్ర చాపమ్ ఇతరత్ర శరంచ మత్వా హృదయం విషయ+అంధకూపాత్ వ్యావర్తయంతి.**

---

**ప్రతిపదార్థం**

**ధన్యాః — వివేకులైన ధన్యులైన; పరమార్థవిదః తు — సర్వోన్నత సత్యాన్ని గ్రహించినవారు; తవ కరే — నీ చేతులయందు; పాశ+అంకుశౌ పరిచింత్య — తాడును, అంకుశమును ధ్యానించి; రాగద్వేషౌ — రాగద్వేషాలను; జయంతి — జయిస్తారు; ఏకత్ర చాపమ్ — ఒక చేతిలో విల్లు; ఇతరత్ర శరంచ — మరొక చేతిలో బాణం పట్టుకున్నట్లుగా; మత్వా — నిన్ను తలచి; హృదయం — తన మనస్సులను; విషయ+అంధకూపాత్ — మోహము అను మానసికాంధకారమునుంచి; వ్యావర్తయంతి — దూరంగా ఉంచుతారు.**

---

**తాత్పర్యం**

**తల్లీ! మీనాక్షీ! వివేకులైన, ధన్యులైన, సర్వోన్నత సత్యాన్ని గ్రహించినవారు నీ చేతులయందు తాడును, అంకుశమును ధ్యానించి రాగద్వేషాలను జయిస్తారు. ఒక చేతిలో విల్లు, మరొక చేతిలో బాణం పట్టుకున్నట్లుగా నిన్ను తలచి, తన మనస్సులను మోహము అను మానసికాంధకారమునుంచి దూరంగా ఉంచుతారు.**

---

**విశేషాలు**

- **గడ్డి మొదలైన దానిచే పయిని కప్పబడిన చీకటి నూతిని అంధకూపమంటారు.**
- **అంధకూపపతనన్యాయం అని ఒక న్యాయం ఉంది. కొంతమంది గుడ్డివాళ్లు ఒకరి వెనుక ఒకరు పోతూ ముందువాడు నూతిలో పడగా తక్కినవాళ్లు కూడా ఆ తోవనే పోతున్నారు కనుక అందరూ ఆ నూతిలో పడిపోయినట్లు అని దాని అర్థం. మన లోకంలో చాలామంది ఇదే పరిస్థితిలో ఉన్నాం. ఇది పద్ధతి కాదని మనలోని మోహమనే చీకటిని ఎలా జయించాలో కవి ఈ శ్లోకంలో చెప్పాడు.**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 77**

**మదనవృత్తం**

**ఉత్క్రాంతమాంతరమిదం కరణం జనానా-**

**మప్యేతి చంద్రమితి హి శ్రుతయో వదంతి |**

**ఆస్తామిదం మమ తు దేవి మనోఽధునైవ**

**లీనంధృఢం వదనచంద్రమసి త్వదీయే || 77 ||**

---

**అన్వయం**

**దేవి జనానామ్ ఉత్క్రాంతమ్ అపి ఇదమ్ ఆంతరం కరణం చంద్రమ్ ఏతి ఇతి హి శ్రుతయః వదంతి ఆస్తామ్ ఇదం మమ తు మనః అధునా+ఏవ దృఢం త్వదీయే వదనచంద్రమసి లీనమ్.**

---

**ప్రతిపదార్థం**

**దేవి — తల్లీ! మీనాక్షీ!; జనానామ్ — జనులయొక్క; ఉత్క్రాంతమ్ అపి — మరణానంతరం; ఇదమ్ ఆంతరం కరణం — ఈ మనస్సు; చంద్రమ్ ఏతి — చంద్రుని చేరుతుందని; ఇతి హి శ్రుతయః వదంతి — అని శ్రుతులు చెబుతాయి; ఆస్తామ్ ఇదం — అది అలా ఉండవచ్చు; మమ తు మనః — నా మనస్సు; అధునా+ఏవ — ఇప్పుడు కూడా; దృఢం — దృఢముగా (వేగంగా); త్వదీయే వదనచంద్రమసి — నీ ముఖం ఆకారంలో ఉన్న చంద్రునిలో; లీనమ్ — లీనమయింది.**

---

**తాత్పర్యం**

**తల్లీ! మీనాక్షీ! మరణానంతరం మనుషుల మనస్సు చంద్రునిపైకి చేరుతుందని శ్రుతులు చెబుతాయి. కానీ ఇప్పుడు కూడా నీ ముఖం ఆకారంలో ఉన్న చంద్రునితో నా మనసు ఏకమైంది.**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 78**

**మదనవృత్తం**

**విద్యాత్మనో జనని తావకదంతపంక్తేః**

**వైమల్యమీదృగితి వర్ణయితుం క్షమః కః |**

**తత్సంభవాయ దమలా వచసాం సవిత్రీ**

**తన్మూలకం కవియశోఽపి తతస్తరాం యత్ || 78 ||**

---

**ప్రతిపదార్థం**

**జనని — తల్లీ!; తావకదంతపంక్తేః — నీ దంతపఙ్క్తియొక్క; వైమల్యమ్ — స్వచ్ఛత; ఈదృక్ ఇతి — ఈ విధంగా అని; వర్ణయితుం — వర్ణించడానికి; కః — ఎవరు; క్షమః — సమర్థుడు?; తత్సంభవాయ — దాని నుండి పుట్టడానికి (కవిత్వం); అమలా — స్వచ్ఛమైన; వచసాం సవిత్రీ — వాక్కుల తల్లి (సరస్వతి); తన్మూలకమ్ — దాని మూలం కలిగిన; కవియశః అపి — కవుల కీర్తి కూడా; తతస్తరాం — అత్యంత ఎక్కువగా ఉంది; యత్ — ఏది అయితే.**

---

**తాత్పర్యం**

**తల్లీ! నీ దంతపఙ్క్తి యొక్క స్వచ్ఛతను ఈ విధంగా అని వర్ణించడానికి ఎవరు సమర్థులు? దాని నుండి కవిత్వం పుట్టడానికి సరస్వతి స్వచ్ఛమైనది. దాని మూలం కలిగిన కవుల కీర్తి కూడా అత్యంత ఎక్కువగా ఉంది. (అంటే, దేవి దంతకాంతి యొక్క స్వచ్ఛతను వర్ణించడం అసాధ్యం, అది వాగ్దేవికి, కవుల కీర్తికి మూలం అని భావం).**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 79**

**మదనవృత్తం**

**స్వచ్ఛాపి తే వహతి యత్కిల దంతపంక్తిః**

**స్వచ్ఛందనిర్దలితదాడిమబీజశోభాం |**

**తన్మే రజోవ్యతికరాధికపాటలిమ్నా**

**చిత్తే పరం పరిచయాదితి చింతయామి || 79 ||**

---

**అన్వయం**

**తే దంతపంక్తిః యత్ స్వచ్ఛా +అపి స్వచ్ఛందనిర్దలితదాడిమబీజశోభాం వహతి తత్ర రజోవ్యతికరాధికపాటలిమ్నా మే చిత్తే పరం పరిచయాత్ ఇతి చింతయామి కిల.**

---

ప్రతిపదార్థం

తే దంతపంక్తిః — మీ స్పష్టమైన తెల్లటి దంతాలు; యత్ స్వచ్ఛా +అపి — నిష్కళంకమైనవి అయినప్పటికీ; స్వచ్ఛందనిర్దలితదాడిమబీజశోభాం — పరిపక్వతతో పగిలిపోతున్న దానిమ్మగింజల ఎరుపు రంగును; వహతి — కలిగి ఉన్నాయని (నేను ఊహించాను); తత్ — అది; రజోవ్యతికర+అధికపాటలిమ్ని — రజోగుణము కలియుటవలన ఉద్వేగభరితమైన కోరికలతో విపరీతంగా ఎరుపు రంగులో; మే చిత్తే — నాయొక్క; పరం — మిక్కిలి; పరిచయాత్ ఇతి — పరిచయమువలన అని; చింతయామి కిల — చింతించుచున్నాను కదా!

---

తాత్పర్యం

తల్లీ! మీనాక్షీ! నా మనస్సుయొక్క ఉద్వేగభరితమైన కోరికలయొక్క ఎరుపు రంగు కలియుటవలన, మీ స్పష్టమైన తెల్లటి దంతాలు పరిపక్వతతో పగిలిపోతున్న దానిమ్మగింజల యొక్క ఎరుపు రంగును కలిగి ఉన్నాయని నేను ఊహిస్తున్నాను.

---

విశేషాలు

- [రజోగుణం ఎరుపు. భోగవ్యామోహాలకు సంకేతం. దేవతయొక్క దంతాలను ధ్యానించడం ద్వారా, దంతాల మరియు అతని మనస్సు మధ్య సంబంధం ఏర్పడుతుంది.]

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 80

మదనవృత్తం

అర్ధం జితత్రిపురమంబ తవ స్మితంచే-

దర్థాంతరేణ చ తథా భవితవ్యమేవ |

తచ్చింతయే జనని కారణసూక్ష్మరూప-

స్థూలాత్మకత్రిపురశాంతికృతే స్మితం తే || 80 ||

---

అన్వయం

**అంబ తవ అర్ధం స్మితం జితత్రిపురమ్ చేత్ అర్ధాంతరేణ చ తథా భవితవ్యమ్ ఏవ తత్ జనని కారణసూక్ష్మరూప-స్థూలాత్మకత్రిపురశాంతికృతే తే స్మితం చింతయే.**

---

**ప్రతిపదార్థం**

**అంబ — తల్లీ! మీనాక్షీ!; తవ — అర్ధనారీశ్వర స్వరూపమైన నీయొక్క; అర్ధం స్మితం — సగభాగపు చిరునవ్వు (శివుని చిరునవ్వు); జితత్రిపురమ్ చేత్ — మూడు రూపాలైన త్రిపురాలను దహిస్తే; అర్ధాంతరేణ చ — మిగిలిన సగభాగపు చిరునవ్వు (అమ్మవారి చిరునవ్వు); తథా భవితవ్యమ్ ఏవ — అంత సాధించలేదా?; తత్ — కావున; జనని — తల్లీ; కారణసూక్ష్మరూప-స్థూలాత్మకత్రిపురశాంతికృతే — నా కారణ, సూక్ష్మ మరియు భౌతిక శరీరాలను కాల్చివేయడానికి; తే స్మితం — నీ చిరునవ్వును; చింతయే — ధ్యానిస్తున్నాను.**

---

**తాత్పర్యం**

**తల్లీ! మీనాక్షీ! నీ చిరునవ్వులో ఒక సగం త్రిపురాసురులను జయించింది. మిగిలిన సగపు చిరునవ్వు అంత సాధించలేదా? (తప్పక సాధిస్తుంది). కావున, తల్లీ, నీ చిరునవ్వు నా కారణ, సూక్ష్మ మరియు భౌతిక శరీరాలను కాల్చివేయడానికి ఆహ్వానిస్తున్నాను.**

---

**విశేషాలు**

- **కారణశరీరం: మూలప్రకృతి నుంచి ఉద్భవించి దేహాకృతి ధరించిన దశలో శరీరం. స్థూలశరీరమూ కాదు, సూక్ష్మశరీరమూ కాని స్థితి.**
- **సూక్ష్మశరీరము: ఆదిశంకరుల 'ప్రబోధసుధాకరం'లో స్థూల, సూక్ష్మ, లింగశరీరాల వివరణ ఉంది. స్థూలశరీరంలో లింగశరీరం ఉంటుందనీ, అదే సూక్ష్మశరీరమనీ, దానికి లోపల ఉండేది కారణశరీరమనీ, దానికంటే లోపల ఉన్నది తురీయమనీ అంటారు. 'జ్ఞానకర్మేంద్రియాలు, ప్రాణాదిపంచవృత్తులతో కూడిన అంతఃకరణమే సూక్ష్మశరీరం.'**
- **భౌతికశరీరం: పంచభూతములకు సంబంధించిన శరీరము భౌతికశరీరము.**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 81**

**మదనవృత్తం**

**మత్క్లేశదర్శనపరిద్రవదంతరంగ-**

**హైయ్యంగవీనపరివాహనిభంజనన్యాః |**

**అంతస్తమోపహమనుస్మరతాం జనానాం**

**మందస్మితం భువనమంగలమస్తు భూత్యై || 81 ||**

---

**అన్వయం**

**మత్క్లేశదర్శనజనన్యాః అంతరంగహైయ్యంగవీనమ్ పరిద్రవత్పరివాహనిభం అనుస్మరతాం జనానాం అంతఃతమోపహమ్ భువనమంగలమ్ తవ తు మందస్మితం భూత్యై అస్తు.**

---

**ప్రతిపదార్థం**

**మత్ — నాయొక్క; క్లేశ — కష్టములను; దర్శన — చూచుటవలన; జనన్యాః — తల్లియైన మీనాక్షియొక్క; అంతరంగహైయ్యంగవీనమ్ — వెన్నలాంటి మనస్సు (నిన్నటి పాలు చిలుకుటతో వచ్చిన దానిని హైయ్యంగవీనమంటారు); పరిద్రవత్ — కరుగుతూ; పరివాహ — చెరువులో ఎక్కువగా ఉన్న నీళ్ళు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగా ఉన్న చివర కట్టిన రాతికట్టడంతో; నిభం — సమానమయినదగుతూ (అనగా అమ్మవారి దయాప్రవాహం పొంగిపొర్లుతున్నదని భావం); అనుస్మరతాం — స్మరింపబడుగాక! (ఆ అమ్మవారి దయ); జనానాం — జనులయొక్క; అంతః+తమోపహమ్ — లోపలి చీకట్లను పోగొడుతుంది; భువనమంగలమ్ — లోకాలకు క్షేమం కలిగిస్తుంది; (తల్లీ! మీనాక్షీ!); తవ తు — నీయొక్క; మందస్మితం — మెల్లని చిరునవ్వు; భూత్యై — ఐశ్వర్యము కొరకు; అస్తు — అగుగాక!**

---

**తాత్పర్యం**

**నా దయనీయ స్థితిని చూసి ఆ తల్లి హృదయం వెన్నలా కరిగి చిరునవ్వులా మెరిసిపోతోంది. చీకట్లను పారద్రోలి ఆనందాన్ని కలిగించే ఆ చిరునవ్వు నాకు, లోకానికి శ్రేయస్సును ప్రసాదించుగాక!**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 82**

**మదనవృత్తం**

**సాంసిద్ధికాననసరోరుహదివ్యగంధ-**

**సాంద్రీకృతేందుశకలాకలితాధివాసం |**

**తాంబూలసారమఖిలాగమబోధసారం**

**మాతర్విధేహి మమ వక్త్రకలాచికాయాం || 82 ||**

---

**అన్వయం**

**మాతః సాంసిద్ధిక ఆననసరోరుహదివ్యగంధసాంద్రీకృతేందుశకలాకలితాధివాసం అఖిల+ఆగమబోధసారం తాంబూలసారమ్ మమ వక్త్రకలాచికాయాం విధేహి.**

---

**ప్రతిపదార్థం**

**మాతః – తల్లి! మీనాక్షీ!; సాంసిద్ధిక – స్వభావసిద్ధమైన; ఆనన – నీ ముఖమను; సరోరుహ – పద్మములో; దివ్య – దివ్యమయిన; గంధ – సుగంధమును వెదజల్లు చందనాదిద్రవ్యములతో; సాంద్రీకృత – దట్టముగా చేయబడిన, మెత్తగా చేయబడిన; ఇందుశకల – బావంచాలతో; ఆకలిత – కూర్చబడి; అధివాసం – సుగంధితం చేయబడిన; అఖిల+ఆగమబోధసారం – సమస్తమైన ఆగమముల బోధలు చెప్పే సారాంశములు కలిగిన; తాంబూలసారమ్ – నీ తమలపాకుల లాలాజలాన్ని; మమ వక్త్ర – నా నోరు అను; కలాచికాయాం – తమ్మపడిగములో వేయునట్లుగా (తాంబూలపు ఉమ్మివేయు పాత్రలో); విధేహి – అనుగ్రహించుము.**

---

**తాత్పర్యం**

**తల్లీ! మీనాక్షీ! నీ మధురమైన నోటి సువాసన కలిగిన సారవంతమైన నీ తమలపాకుల లాలాజలాన్ని నాకు అనుగ్రహించండి.**

---

**విశేషాలు**

- **శ్రీకాళిదాసకవి, మూకకవి మొదలైనవారు అమ్మవారి తాంబూల సారాంశము గ్రహించుట వలన అద్భుతమైన కవిత్వం రచించారని పెద్దలు చెబుతారు. అందుకే తనకు కూడా ఆ అనుగ్రహం కలిగించమని దీక్షితులవారి ప్రార్థన.**

---

**మదనవృత్తం**

**నాసామణిస్తవ శివే చిరసంస్తవేన**

**ప్రత్యాహృతే మనసి భాతి తపోధనానాం |**

**అజ్ఞానసంతతినిశాత్యయసూచనార్థం**

**ఆవిర్భవంత్యసురదేశికతారకేవ || 83 ||**

---

**అన్వయం**

**శివే చిరసంస్తవేన ప్రత్యాహృతే తపోధనానాం మనసి తవ నాసామణిః అజ్ఞానసంతతినిశాత్యయసూచనార్థం అసురదేశికతారకా+ఇవ ఆవిర్భవంతీ భాతి.**

---

**ప్రతిపదార్థం**

**శివే – శివుని భార్యా! తల్లీ మీనాక్షీ!; చిరసంస్తవేన – చాలాకాలముయొక్క స్తుతించుటచే; ప్రత్యాహృతే – వెనుకకు మరల్చబడిన (బాహ్య మరియు అంతరింద్రియములు కల); తపోధనానాం – తపోధనులైన ఋషులయొక్క; మనసి – మనస్సులలో; తవ – నీయొక్క; నాసామణిః – ముక్కెర; అజ్ఞానసంతతి – అజ్ఞాన సమూహమను; నిశాత్యయ – సుదీర్ఘ రాత్రి ముగింపయిన ప్రాతఃకాలమును; సూచనార్థం – సూచించే; అసురదేశికతారకా+ఇవ – శుక్రగ్రహం వలె; ఆవిర్భవంతీ – ఆవిర్భవించుచూ; భాతి – ప్రకాశిస్తుంది.**

---

**తాత్పర్యం**

**తల్లీ మీనాక్షీ! మీ ముక్కుయొక్క ముక్కెర సుదీర్ఘ అభ్యాసం ద్వారా ఇంద్రియాలను నియంత్రణలోకి తెచ్చిన ఋషుల మనస్సులలో అజ్ఞానమను సుదీర్ఘ రాత్రి ముగింపును సూచించే శుక్రగ్రహం వలె ప్రకాశిస్తుంది. (అమ్మవారి ముక్కెర కాంతి ఋషుల అజ్ఞానమను చీకట్లను పోగొడుతుందని భావం).**

---

**విశేషాలు**

- **తూర్పు ఆకాశంలో శుక్రగ్రహం కనిపించడం ప్రాతఃకాలము యొక్క సామీప్యాన్ని సూచిస్తుంది. దీనిని ఈ శ్లోకంలో దీక్షితులవారు పోలికగా వాడారు.**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 84**

**మదనవృత్తం**

**తాంబూలగర్భపరిపుల్లకపోలలక్ష్య-**

**తాటంకమౌక్తికమణిప్రతిబింబదంభాత్ |**

**అస్తద్వయవ్యతికరామలసత్త్వమాద్యం**

**వర్ణం బిభర్తి జఠరే తవ వక్త్రబింబం || 84 ||**

---

**అన్వయం**

**తాంబూలగర్భపరిపుల్లకపోలలక్ష్యతాటంకమౌక్తికమణిప్రతిబింబదంభాత్ అస్తద్వయవ్యతికరామలసత్త్వమ్ ఆద్యం వర్ణమ్ తవవక్త్రబింబం జఠరే బిభర్తి.**

---

**ప్రతిపదార్థం**

**తాంబూలగర్భ — అజీర్ణాదులను పోగొట్టు తాంబూలమును కలిగి ఉండుటచేత; పరిపుల్ల — బాగా వికసించిన; కపోలలక్ష్య — చెంపల లక్ష్యముగా; తాటంక — చెవులకు ధరించు అలంకారములైన చెవికమ్మలలోని; మౌక్తికమణిప్రతిబింబదంభాత్ — ముత్యపుమణి నీడల మోసమువలన (చెవిలో తాంబూలం ఉన్నందున ఉబ్బిన చెంపపై కనిపించే చెవులయొక్క ముత్యాల నీడవలన); అస్తద్వయవ్యతికర — రెండు చెవికమ్మల మణుల నీడలయొక్క పరస్పర మేళనమువలన; అమలసత్త్వమ్ — స్వచ్ఛమైన రూపం కలిగిన; ఆద్యం వర్ణం — బ్రహ్మస్వరూపమైన 'ఓం' అనే మొదటి అక్షరాన్ని; తవ వక్త్రబింబం — నీ ముఖబింబం; జఠరే బిభర్తి — తనలోనే ఉంచుకుంటుంది.**

---

**తాత్పర్యం**

**తల్లీ! మీనాక్షీ! నువ్వు తాంబూలం నములుతున్న సమయంలో ఉబ్బి మెరుస్తున్న నీ చెంపల అద్దాలలో, నీ చెవులకు పెట్టుకొన్న చెవికమ్మల ముత్యాల నీడలు ప్రతిబింబిస్తున్నాయి. నీ చెంపల అద్దాలలో, నీ చెవులకు పెట్టుకొన్న చెవికమ్మల ప్రతిబింబిస్తున్న ముత్యాల నీడలు 'ఓం' అనే మొదటి అక్షరంగా చూపరులకు దర్శనమిస్తున్నాయి.**

---

**విశేషాలు**

- **ఉత్పల దేవుడు తన శివస్తోత్రావళిలో "స్వామీ! తమయొక్క ఇష్టానుసారమే, నీయొక్క భక్తుడను అయియున్నాను. ఐనా నీదైన ముఖస్వరూపము ఒకప్పుడైన చూడలేకపోయాను" (12వ స్తోత్రం -26 వ శ్లోకం) అని బాధపడతాడు. కానీ ఈ శ్లోకంలో దీక్షితులవారికి అమ్మవారి ముఖదర్శనమై తాను ధన్యుడయ్యాడు. మనలను ధన్యులుగా చేసాడు.**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 85**

**మదనవృత్తం**

**దత్తే శ్రియం బహువిధాం కుశలాని దత్తే**

**దత్తే పదం సురపతేరపి లీలయైవ |**

**ఈదృగ్విధాంబ తవ దృష్టిరితోఽధికావా**

**నాద్యాపి కర్ణమతివర్తితుమీశ్వరీయం || 85 ||**

---

**అన్వయం**

**అంబ ఈశ్వరీ తవ దృష్టిః బహువిధాం శ్రియం దత్తే కుశలాని దత్తే సురపతేః అపి పదం లీలయా+ఏవ దత్తే ఈదృక్విధా ఇతః అధికావా ఇయం అద్యాపి కర్ణమ్ అతివర్తితుమ్ న ఈశ్వరీ.**

---

**ప్రతిపదార్థం**

**అంబ – తల్లీ! మీనాక్షీ!; తవ దృష్టిః – నీ చూపు; బహువిధాం శ్రియం దత్తే – అనేక రకాల శ్రేయస్సులను, వైభవాలను ఇస్తుంది; కుశలాని దత్తే – అన్ని రకాల క్షేమములను, తృప్తులను, పుణ్యములను ఇస్తుంది; సురపతేః +అపి – ఇంద్ర; పదం – స్థానాన్ని కూడా; లీలయా+ఏవ – లీలతో, (భక్తునికి); దత్తే – ఇస్తుంది; ఈదృక్ +విధా – ఈ విధంగా అనేక రకాలుగా; ఇతః +అధికావా – పూర్వం కంటె కూడా అధికంగా; ఇయం తవ దృష్టిః – ఈ నీ దృష్టి (దత్తే – ఇస్తుంది); అద్యాపి – (కానీ) ఇప్పటికీ; కర్ణమ్ – చెవిని మించి; అతివర్తితుమ్ – దాటుటకు; న ఈశ్వరీ – శక్యముకాదు.**

---

**తాత్పర్యం**

**తల్లీ! మీనాక్షీ! పరమేశ్వరీ! నీ చూపు అనేక రకాల శ్రేయస్సులను, వైభవాలను ఇస్తుంది. అన్ని రకాల క్షేమములను, తృప్తులను, పుణ్యములను ఇస్తుంది. ఇంద్ర పదవిని కూడా భక్తునికి సులభంగా ప్రసాదిస్తుంది. నీ భక్తులకు పూర్వము కంటె అధికంగా వైభోగాలను నీ కరుణాపూరితమైన చూపు అనుగ్రహిస్తుంది. కానీ, ఈ రోజు వరకు, చెవిని మించిన నైపుణ్యం నీ చూపుకు రాలేదు.**

---

**విశేషాలు**

- **విశాలమైన కన్నులు అని చెప్పటానికి చెవుల వరకు విస్తరించిన కన్నులు అని కవి సమయం. చూపు చెవిని దాటటం లేదంటే చెవుల వరకు అమ్మవారి కన్నులు విస్తరించాయని కవి ఆంతర్యం.**

---

**. శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 86**

**శ్లోకం**

**పాషాణకూటకఠినే జనదుర్విగాహే**

**వ్యర్థం మహత్యుపనిషద్విపినే ప్రవృత్తా**

**సేవ్యేత కేన తవ లోచనచంద్రికేయ-**

**మేనాం నిపాతయ సకృన్మయి తప్యమానే**

**.. 86 ..**

**ప్రతిపదార్థం**

**పాషాణకూటకఠినే = రాళ్ళతో నిండిన పర్వతశిఖరాల కఠినత్వాలతో నిండిన, జనదుర్విగాహే = జనులకు మునుగుటకు సాధ్యము కాని (జనులకు అగమ్యగోచరమైన), మహతి = గొప్పదైన, ఉపనిషద్విపినే = ఉపనిషత్తుల విస్తారమైన అడవులపై, తవ = నీయొక్క, ఇయం = ఈ, లోచనచంద్రికా = నీ కన్నుల చంద్రకాంతి, వ్యర్థం ప్రవృత్తా = వ్యర్థంగా ప్రకాశించుటవలన, కేన = ఎవరు, సేవ్యేత = ప్రయోజనం పొందుతారు?, ఏనాం = ఈ, తప్యమానే = ఈ విధంగా వేదనతో బాధపడుతున్న, మయి = నాయందు, సకృత్ = ఒకసారి, నిపాతయ = ఉంచుము.**

**తాత్పర్యం**

**మనుష్యులచే అగమ్యగోచరమైన, కొండలతో నిండిన ఉపనిషత్తుల విస్తారమైన అడవులపై వ్యర్థంగా ప్రకాశించే నీ కన్నుల చంద్రకాంతి ద్వారా ఎవరు ప్రయోజనం పొందుతారు? వేదనతో బాధపడుతున్న నన్ను కాసేపు ఆ చంద్రకాంతిలో స్నానం చేయించు.**

**విశేషాలు**

**"ఓంకారపంజరశుకీం / ఉపనిషదుద్యానకేళికలకంఠీం / ఆగమవిపినమయూరీం / ఆర్యామంతర్విభావయేగౌరీం" అను ప్రసిద్ధ శ్లోకం ఈ సందర్భంలో స్మరణీయం. ఉపనిషదుద్యానము దీక్షితులవారి శ్లోకంలో ఉపనిషద్విపినమయింది.**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 87**

**శ్లోకం**

**కామం శివేన శమితం పునరుజ్జగార**

**దృష్టిస్తవేతి కిమియం జనని స్తుతిస్తే**

**లీలాప్రసూత పురుషార్థచతుష్టయాయా-**

**స్తస్యాః పరంతు స భవత్యవయుత్యవాదః**

**.. 87 ..**

**ప్రతిపదార్థం**

**జనని = తల్లీ! మీనాక్షీ!, శివేన = శివునిచే, శమితం = సంహరింపబడిన, కామం = మన్మథుని, తవ దృష్టిః = నీ చూపు, పునః = మరలా, ఉజ్జగార = బ్రతికించింది, ఇతి = అని చెప్పే, ఇయం స్తుతిః = ఈ స్తుతిలో, కిమ్ = ఏమున్నది? (ఏమంత గొప్పతనం లేదని భావం), పరంతు = కానీ, లీలాప్రసూత పురుషార్థచతుష్టయాయాః = జీవితంయొక్క నాలుగు ఔదార్యకరమైన ప్రయోజనాలయిన ధర్మం, అర్థం, కామం, మోక్షాలను ప్రసాదించే, తస్యాః = నీ చూపును కీర్తించే, సః = వాడు, అవయుత్యవాదః = ఇది ఒక దానిని మాత్రమే వేరుచేసే అవమానకరమైన పదం, భవతి = అవుతుంది.**

**తాత్పర్యం**

**ధర్మార్థకామమోక్షాలైన నాలుగు పురుషార్థాలనూ ప్రసాదించే నీ చూపుని, శివునిచే దహించబడిన మన్మథుని బ్రతికించిందని చెప్పటం అసంపూర్ణమైన స్తోత్రం మాత్రమే.**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 88**

**శ్లోకం**

**సోమో జగజ్జనయితేతి యదాహ వేదో**

**నేదం లతాపరమితి భ్రమితవ్యమార్యైః**

యః శైవవామతనువర్తి భవద్దృగాత్మా

చంద్రో జగత్సృజతి తత్పర ఏష వాదః

.. 88 ..

ప్రతిపదార్థం

యదా = ఎప్పుడు, వేదః = వేదం, సోమః = చంద్రుడు, జగత్ జనయితా = ప్రపంచాన్ని సృష్టించేవాడు, ఇతి ఆహ = అని చెప్పిందో, ఇదం = ఇది, లతాపరం = (సాధారణమైన) తీగకు సంబంధించినది, ఇతి = అని, ఆర్యైః = పెద్దలచేత, భ్రమితవ్యం న = భ్రమ పడకూడదు. యః = ఏ, భవత్ దృగాత్మా = నీ చూపు స్వరూపమైన, శైవవామతనువర్తి = శివుని ఎడమ శరీరంలో ఉన్న, చంద్రః = చంద్రుడు, జగత్ సృజతి = జగత్తును సృష్టిస్తాడో, తత్ పరః = దాని గురించిన, ఏషః = ఈ, వాదః = వాదం (వేద వచనం).

తాత్పర్యం

వేదం 'సోముడు (చంద్రుడు) జగత్తును సృష్టిస్తాడు' అని చెప్పినప్పుడు, ఇది సాధారణమైన చంద్రుని గురించి అని భ్రమపడకూడదు. శివుని ఎడమ శరీరంలో ఉన్న, నీ చూపు స్వరూపమైన ఏ చంద్రుడు జగత్తును సృష్టిస్తాడో, దాని గురించే ఈ వేద వచనం.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 89

శ్లోకం

సూచ్యగ్రవద్వసుమతీ మణువచ్చమేరుం

దృష్టిర్యదంబ తవ పశ్యతి దానశౌండా

దృష్టాస్త్వయా వయమపీహ తతః స్మరామో

వేశంతమేవ భవసాగర ముత్తరంగం

.. 89 ..

ప్రతిపదార్థం

అంబ = తల్లీ! మీనాక్షీ!, దానశౌండా = దానము చేయుటలో శ్రేష్ఠురాలివైన, తవ దృష్టిః = నీ చూపు, వసుమతీం = భూమిని, సూచ్యగ్రవత్ = సూదిమొనగా, మేరుం = సూర్యచంద్రుల ద్వారా కొలువబడు మహాపర్వతమైన మేరు పర్వతమును, అణువత్ చ = చాలా చిన్నదిగా, యత్ పశ్యతి = ఏది చూచిందో, తతః = అందువలన, త్వయా దృష్టాః = నీచేత

చూడబడుతున్న, ఇహ = ఇక్కడ ఈ లోకంలో ఉన్న, వయమ్ అపి = మేము కూడా, ఉత్తరంగం = ఎత్తైన అలలు కల, భవసాగరం = సంసారసాగరాన్ని, వేశంతం ఏవ = (కప్పలు మొదలగునవి ప్రవేశించుటకు వీలుగా ఉన్న) ఒక కుంటగా, స్మరామః = తలచెదము.

తాత్పర్యం

తల్లీ! మీనాక్షీ! నీ చూపు చాలా ఉదారంగా ఉన్నందున భూమిని సూదిమొనగా, సూర్యచంద్రుల ద్వారా కొలువబడు మహాపర్వతమైన మేరు పర్వతమును కేవలం పరమాణువుగా భావిస్తుంది. అదే పద్ధతిలో కష్టాలతో కొట్టుమిట్టాడుతున్న నీ భక్తులమైన మా ఈ సంసారసాగరాన్ని ఒక కుంటగా నీ చూపు చూడగలదని భావిస్తాము.

విశేషాలు

ఎంత పెద్దదాన్నయినా చిన్నదిగా చూడగలుగు అమ్మవారి చూపు, జన్మల పరంపరలు కలిగిన భక్తుల సంసారసాగరాన్ని కూడా, చిన్నదిగా చేసి, తరింపజేసి ఈ జన్మలోనే మోక్షాన్ని ప్రసాదించమని దీక్షితులవారి శ్లోకభావం.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 90

శ్లోకం

వాణీనికేతనతయా ఘనసారగౌరాః

కల్హారకేసరరుచః కమలానుషంగాత్

మాతర్జయంతి శరణాగతలోకచేతో-

మాలిన్యమార్జనవశాదసితాః కటాక్షాః

.. 90 ..

ప్రతిపదార్థం

మాతః = తల్లీ! మీనాక్షీ!, వాణీనికేతనతయా = (నీ కటాక్షములు) సరస్వతికి నివాసం కావడం వల్ల, ఘనసారగౌరాః = కర్పూరంలా తెల్లగా మెరుస్తున్నాయి. కమలానుషంగాత్ = లక్ష్మీదేవితో కలిసి ఉండటం వల్ల, కల్హారకేసరరుచః = కమలంలోని తంతువులవలె ఎర్రగా ఉంటాయి. శరణాగతలోకచేతో- మాలిన్యమార్జనవశాత్ = శరణాగతి చేసిన వ్యక్తుల మనస్సులలోని పాపాలను శుద్ధిచేయుట వలన, అసితాః = నల్లగా ఉన్న, కటాక్షాః = నీ కటాక్షములు (క్రీగంటి చూపులు), జయంతి = జయింపబడుచున్నవి.

తాత్పర్యం

తల్లీ! మీనాక్షీ! నీ కటాక్షాలు (క్రీగంటిచూపులు) మూడు రంగులలో ఉంటాయి. సరస్వతికి నివాసం కావడం వల్ల కర్పూరంలా తెల్లగా మెరుస్తున్నాయి. లక్ష్మీదేవితో కలిసి ఉండటం వల్ల తామరపువ్వులలోని తంతువులవలె ఎర్రగా ఉంటాయి. శరణాగతి చేసిన వ్యక్తుల పాపాలను పోగొట్టుట వలన ఆ పాపాల రంగు (నలుపు) కలియుట వలన నల్లగా ఉంటాయి. అవి ఎప్పుడూ లోకంలో జయింపబడుతుంటాయి.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 91

శ్లోకం

ఆకర్ణముల్లసతి మాతరపాంగదేశే

కాలాంజనేన ఘటితా తవ భాతిరేఖా

శైవాలపంక్తిరివ సంతతనిర్జిహాన-

కారుణ్యపూరపదవీకలితానుబంధా

.. 91 ..

ప్రతిపదార్థం

మాతః = తల్లీ! మీనాక్షీ!, ఆకర్ణం = చెవులవరకు విస్తరించి, ఉల్లసతి = ఉల్లసిల్లుచున్న, తవ = నీయొక్క, అపాంగదేశే = కన్నుకొన భాగములో (కడకంటి భాగములో), కాలాంజనేన = నల్లని కాటుకచేత, ఘటితా రేఖా = ఏర్పడిన రేఖ, సంతతనిర్జిహానకారుణ్యపూరపదవీకలితానుబంధా = నిరంతరం పెరుగుతున్న దయయొక్క వరదలో చేరి, శైవాలపంక్తిః ఇవ = నాచు (నీటిపాచి) వరుసలా, భాతి = ప్రకాశిస్తున్నది.

తాత్పర్యం

తల్లీ! మీనాక్షీ! చెవులవరకు విస్తరించిన నీ విశాలమైన కడకంటి భాగములో నల్లని కాటుకచేత ఏర్పడిన రేఖ - నిరంతరం పెరుగుతున్న నీ దయయొక్క వరదలో చేరిన నాచు (నీటిపాచి) వరుసలా ప్రకాశిస్తున్నది.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 92

శ్లోకం

విశ్వం సృజత్యవతి హంతి చ యత్కటాక్షో

విశ్వస్యతాం కథమసౌ చపలస్వభావః

ఏషోఽపి యామనుసరల్లభతే యశాంసి

తామేవ విశ్వసిమి దేవి తవానుకంపం

.. 92 ..

ప్రతిపదార్థం

దేవి = తల్లీ! మీనాక్షీదేవి!, యత్ కటాక్షః = ఏ నీ కడకంటి చూపు, విశ్వం సృజతి = ప్రపంచాన్ని సృష్టించడం, అవతి = సంరక్షించడం, హంతి చ = మరియు నాశనం చేస్తుందో, అసౌ చపలస్వభావః = ఈ నిలుకడలేని స్వభావమును, కథం = ఎట్లు, విశ్వస్యతాం = నమ్మగలను? ఏషః అపి = వీడు కూడా, యాం అనుసరన్ = ఏది అనుసరిస్తే, యశాంసి లభతే = కీర్తి కలుగుతుందో, తాం = దానిని, తవ అనుకంపాం ఏవ = నీ దయను మాత్రమే, విశ్వసిమి = నమ్ముచున్నాను.

తాత్పర్యం

తల్లీ! మీనాక్షీదేవి! విశ్వాన్ని సృష్టించే, రక్షించే మరియు నాశనం చేసే, నీ నిలకడలేని స్వభావాన్ని నేను ఎలా నమ్ముతాను? (నమ్మనని భావం) నేను నీ కరుణను మాత్రమే విశ్వసిస్తాను. ఆ కరుణ నాకు కీర్తిని కలిగిస్తుంది.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 93

శ్లోకం

అర్ధం కలంకరహితా కరుణైవ శంభో-

రర్ధం గుణాస్తదితరే సకలాః సమేతాః

ఇత్యంబ సంప్రతి కిల స్ఫురితం రహస్యం

సంపశ్యతో మమ భవన్మయమైశమర్ధం

.. 93 ..

ప్రతిపదార్థం

అంబ = తల్లీ! మీనాక్షీ!, కలంకరహితా = మచ్చలేని, కరుణా ఏవ = దయయే, శంభోః = శివునియొక్క (ఇతనినుండి శుభము జరుగును అని శంభు పదానికి అర్థం), అర్ధం = సగముగా ఉన్నది. తత్ ఇతరే = మిగిలిన, సకలాః గుణాః = అతనియొక్క సకలమైన గుణములు, అర్ధం = సగముగా ఉన్నదను, ఇతి = అని, రహస్యం = రహస్యము, భవత్ మయమ్ = అర్ధనారీశ్వర స్వరూపంలో నీతో కూడుకొన్న, ఐశమ్ అర్ధం = ఈశ్వరునియొక్క సగభాగమును, సంపశ్యతః = చూస్తున్నప్పుడు, మమ = నాకు, సంప్రతి = ఇప్పుడు, కిల స్ఫురితం = స్ఫురించింది కదా!

**తాత్పర్యం**

తల్లీ! మీనాక్షీ! మచ్చలేని దయయే, శివునియొక్క సగముగా ఉన్నది. (అర్ధనారీశ్వర స్వరూపంలో సగభాగమైన నువ్వు దయాస్వరూపిణిగా ఉన్నావని అర్థం). అతనియొక్క సకలమైన గుణములు మిగిలిన సగముగా ఉన్నదను రహస్యము నాకు ఇప్పుడు స్ఫురించింది. (శివునికంటే అమ్మ దయ కలదని కవి ప్రౌఢోక్తి).

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 94**

**శ్లోకం**

**అంబ భ్రువోస్తవ విచేష్టితమప్రమత్తం**

**సంపశ్యతాం నిజనిజార్థనిదేశహేతోః**

**తన్మూలదేశనిహితాని భృతాసురాణాం**

**దృష్టిః ప్రయాతి మృగనాభివిశేషకత్వం**

**.. 94 ..**

**ప్రతిపదార్థం**

**అంబ = తల్లీ! మీనాక్షీ!, తవ = నీయొక్క, భ్రువోః = కనుబొమ్మల కదలికల ద్వారా, విచేష్టితం = ప్రయత్నించబడిన, నిజనిజార్థనిదేశహేతోః = తమ వ్యవహారాలలో ఆజ్ఞలను తెలుసుకోవటానికి, అప్రమత్తం = జాగరూకులై, సంపశ్యతాం = చూచుచుందురు కదా! సురాణాం = దేవతలయొక్క, తన్మూలదేశనిహితానిభృతా = కనురెప్పల మధ్య చొప్పించబడి మరియు కదలకుండా ఉన్న, దృష్టిః = దృష్టి, మృగనాభివిశేషకత్వం = కస్తూరివలె, ప్రయాతి = ఉన్నది.**

**తాత్పర్యం**

తల్లీ! మీనాక్షీ! దేవతలు, నీ కనుబొమ్మల కదలిక ద్వారా తమ వ్యవహారాలను తెలుసుకుని, నీ ఆజ్ఞలను అమలుచేస్తారు. వారి పదునైన చూపులు, మీ కనుబొమ్మలపై అలా నిరంతరం నిలిచిపోవటంవలన, ఆ చూపులన్నీ నీ కనుబొమ్మల మధ్యలో కస్తూరి గుర్తులా ప్రకాశిస్తాయి.

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 95**

**శ్లోకం**

**సారం కణం కణమఘర్మరుచాం సహస్రా-**

త్సంగృహ్యా నిర్మితమిదం తవ వక్త్రబింబం

తావత్ సుధాకర కలంకకులాని పశ్చా-

దేకత్ర దేవి నిహితాని కచాపదేశాత్

.. 95 ..

ప్రతిపదార్థం

దేవి = అనేక విధములుగా ఆడుదానా! తల్లీ! మీనాక్షీ!, సహస్రాత్ అఘర్మరుచాం = వేయి చంద్రులలో, కణం కణం సారం = కణము కణమునుండి వెలికితీసిన సారమును, సంగృహ్యా = స్వీకరించి, ఇదం తవ = ఈ నీ, వక్త్రబింబం = ముఖబింబము, నిర్మితం = నిర్మించబడింది. తావత్ = ఆ పరిమాణం కల, సుధాకర కలంకకులాని = అనేక చంద్రులయొక్క నల్లని మచ్చల సమూహము, పశ్చాత్ = వెనుకవైపు, ఏకత్ర = ఒకే స్థానములో, కచాపదేశాత్ = నీ వెంట్రుకల లక్ష్యముగా, నిహితాని = ఉంచబడినది.

తాత్పర్యం

తల్లీ! మీనాక్షీ! కణములవారీగా వెలికితీసిన వేయి చంద్రుల ప్రకాశవంతమైన భాగాలతో నీ ముఖం సృష్టించబడింది. ఆ అనేక చంద్రులలో ఉన్న నల్ల మచ్చలు, నీ ముఖానికి వెనుకగా ఉన్న నీ నల్లని జుట్టుగా మారాయి.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 96

శ్లోకం

విన్యస్తమింద్రమణికందలసుందరేషు

కేశేషు తే స్ఫటికనిర్మలమిందుఖండం

ఆధారసంగతివశాదసితాయమాన-

మిందీవరచ్ఛదవతంసదశాంబిభర్తి

.. 96 ..

ప్రతిపదార్థం

ఇంద్రమణి కందల సుందరేషు = నీలవర్ణమైన మణి కొత్త మొలకలవలె అందంగా కనబడు, తే కేశేషు = నీ కేశములయందు, విన్యస్తం = ఉంచబడిన, స్ఫటికనిర్మలం = స్ఫటికంలా ప్రకాశవంతంగా ఉన్న, ఇందుఖండం = చంద్రకళ,

**ఆధారసంగతివశాత్ = ఆధారపు చేరిక వలన, అసితాయమానం = నల్లరంగులోకి మారి, ఇందీవరచ్ఛద = లక్ష్మికి ప్రియమైన నల్లకలువయొక్క రేకులా మారి, వతంసదశాం = శిరోభూషణ దశను, బిభర్తి = పోషించుచున్నది (వహించుచున్నది).**

**తాత్పర్యం**

**నీలమణి కొత్త మొలకలవలె అందంగా కనబడు, నీ కేశములయందు ఉంచబడిన స్ఫటికంలా ప్రకాశవంతంగా ఉన్న, చంద్రకళ - నీలమణుల మధ్య ఉండుటవలన నల్లరంగులోకి మారి, నల్లకలువయొక్క రేకులా మారి, నీ శిరోభూషణముగా ప్రకాశిస్తున్నది.**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 97**

**శ్లోకం**

**చింతామణిస్త్రిభువనేశ్వరి కౌస్తుభశ్చ**

**ఖ్యాతౌ మణీ తవ గృహాంగణకుట్టిమస్థౌ**

**కిం రత్నమన్యదుపలభ్య కిరీటకోటిం**

**వాచస్పతిప్రభృతయస్తవ వర్ణయంతు**

**.. 97 ..**

**ప్రతిపదార్థం**

**త్రిభువనేశ్వరి = మూడు లోకాలకు రాణీ! తల్లీ! మీనాక్షీ!, చింతామణిః చ = చింతామణి మరియు, కౌస్తుభః చ = కౌస్తుభమను, ఖ్యాతౌ మణీ = ప్రసిద్ధిచెందిన మణులు, తవ గృహాంగణకుట్టిమస్థౌ = నీయొక్క ఇంటిముంగిలికి సంబంధించిన రాతికట్టడపు నేలలుగా ఉన్నాయి. అన్యత్ కిం రత్నం = ఏదైనా ఇతర రత్నం, ఉపలభ్య = పొంది, తవ కిరీటకోటిం = నీయొక్క కిరీట సమూహ రత్నాలను, వాచస్పతిప్రభృతయః = బృహస్పతి మరియు ఇతరులు, వర్ణయంతు = వర్ణించగలరు?**

**తాత్పర్యం**

**మూడు లోకాలకు రాణీ! తల్లీ! మీనాక్షీ! చింతామణి కౌస్తుభమను ప్రసిద్ధిచెందిన మణులు నీయొక్క ఇంటిముంగిలికి సంబంధించిన రాతికట్టడపు నేలలుగా ఉన్నాయి. ఇటువంటి పరిస్థితుల్లో నీ కిరీటాన్ని ఏ ఇతర ఆభరణాలు అలంకరిస్తాయో, ఎవరికైనా అర్థమయ్యేలా ఎవరు వర్ణించగలరు? గొప్పవాడైన బృహస్పతి మరియు ఇతరులు కూడా అలా వర్ణించటానికి అశక్తులు.**

**విశేషాలు**

అమ్మవారి ఇంటిముందు లోకంలో ప్రసిద్ధిచెందిన చింతామణి కౌస్తుభమను మణులు ఇంటిముంగిలికి సంబంధించిన రాతికట్టడపు నేలలుగా ఉన్నాయి. ఇటువంటి పరిస్థితుల్లో అమ్మవారి కిరీటంలో చింతామణి కౌస్తుభాలకంటే చాలా విలువైన మణులు ఉండి ఉంటాయని కవి ఊహ. అవి ఎలా ఉంటాయో వర్ణించటానికి బృహస్పతి మొదలైనవారు చాలరని, అమ్మవారి కిరీటంలో ఉన్న మణులు వర్ణనాతీతాలని కవి భావం.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 98

శ్లోకం

ప్రాదుర్భవత్తరణిబింబశతారుణాని

పర్యాప్తశీతకిరణాయుతశీతలాని

శృంగారసారపరివాహమయాని మాత-

రంగాని కేఽపి చరమే జనుషి స్మరంతి

.. 98..

ప్రతిపదార్థం

మాతః = తల్లీ! మీనాక్షీ!, ప్రాదుర్భవత్తరణిబింబశతారుణాని = ఉదయించే వందమంది సూర్యుల ఎర్రటి వర్ణంతో కూడుకొన్న, పర్యాప్తశీతకిరణాయుతశీతలాని = తృప్తికరమైన పదివేలమంది చంద్రులవలె చల్లగా ఉన్న, శృంగారసారపరివాహమయాని = నలువైపుల చక్కనైన ప్రేమ ప్రవాహాలతో కూడుకొన్న, అంగాని = నీ శరీరావయాలను, కే అపి = అదృష్టవంతులైన కొద్దిమంది మాత్రమే, చరమే జనుషి = తమ చివరి జన్మలలో, స్మరంతి = స్మరిస్తారు.

తాత్పర్యం

తల్లీ! మీనాక్షీ! ఉదయించే వందమంది సూర్యుల ఎర్రటి వర్ణంతో కూడుకొన్న, తృప్తికరమైన పదివేలమంది చంద్రులవలె చల్లగా ఉన్న, నలువైపుల చక్కనైన ప్రేమ ప్రవాహాలతో కూడుకొన్న నీ శరీరావయాలను, అదృష్టవంతులైన కొద్దిమంది మాత్రమే తమ చివరి జన్మలలో స్మరిస్తారు.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 99

శ్లోకం

ప్రత్యగ్రకుంకుమరసాకలితాంగరాగం

ప్రత్యంగదత్తమణిభూషణజాలరమ్యం

తాంబూలపూరితముఖం తరుణేందుచూడం

సర్వారుణం కిమపి వస్తు మమావిరస్తు

.. 99 ..

ప్రతిపదార్థం

ప్రత్యగ్రకుంకుమరసాకలితాంగరాగం = నూతనము; పరిశుద్ధమైన కుంకుమ రసముతో కూర్చబడిన చందనాది లేపనము కలది, ప్రత్యంగదత్తమణిభూషణజాలరమ్యం = ప్రతి అవయవములోను అలంకరించబడిన మణిభూషణ సమూహములచే అందమైనది, తాంబూలపూరితముఖం = తాంబూలముతో నిండిన నోరు కలది, తరుణేందుచూడం = శిరస్సుపై యువ చంద్రునితో అలంకరించబడినది, సర్వారుణం = అంతటా ఎర్రగా కనిపించునది అయిన, కిమపి వస్తుః = ఒకానొక వస్తువు, మమ = నా కనులముందు, ఆవిరస్తు = ఆవిష్కరింపబడుగాక!

తాత్పర్యం

పరిశుద్ధమైన కుంకుమ రసముతో కూడిన చందనాది లేపనము కలది, ప్రతి అవయవములోను అలంకరించబడిన మణిభూషణ సమూహములచే అందమైనది, తాంబూలముతో నిండిన నోరు కలది, శిరస్సుపై యువ చంద్రునితో అలంకరించబడినది, అంతటా ఎర్రగా కనిపించునది అయిన ఒకానొక వస్తువు నా కనులముందు ఆవిష్కరింపబడుగాక.

విశేషాలు

ఈ విశేషణాలన్నీ అమ్మవారికి సంబంధించినవి. తల్లి మీనాక్షి తన కనులముందు కనబడాలని కవి భక్తుడు ఈ శ్లోకంలో తహతహపడుతున్నాడు.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 100

శ్లోకం

అర్ధం స్త్రియస్త్రిభువనే సచరాచరేఽస్మి-

న్నర్ధం పుమాంస ఇతి దర్శయితుం భవత్యా

స్త్రీపుంసలక్షణమిదం వపురావృతం య-

త్తేనాసి దేవి విదితాత్రిజగచ్ఛరీరా

.. 100 ..

**ప్రతిపదార్థం**

**దేవి = అనేక విధములుగా ఆడుదానా! తల్లీ! మీనాక్షీ!, సచరాచరే అస్మిన్ = ఈ తిరుగునదియు తిరుగనిదియునైన, త్రిభువనే = మూడు లోకములలో, అర్ధం స్త్రియః = సగము స్త్రీలు, అర్ధం పుమాంసః = సగము పురుషులు ఉన్నారు, ఇతి దర్శయితుం = ఈ విషయాన్ని చూపటానికి, స్త్రీపుంసలక్షణం = స్త్రీ పురుష లక్షణాలు కలిగిన, ఇదం వపుః = ఈ అర్ధనారీశ్వర శరీరము, భవత్యా = నీచేత, యత్ ఆవృతం = ఏదయితే ఆవరించబడి ఉన్నదో, తేన = దానిచేత, త్రిజగచ్ఛరీరా = మూడు లోకములు శరీరముగా కలదానివిగా, విదితా అసి = తెలియబడుచున్నావు.**

**తాత్పర్యం**

**తల్లీ! మీనాక్షీ! ఈ మూడు లోకములలో ప్రపంచంలో సగము పురుషులు సగము స్త్రీలు ఉన్నారు. ఈ సత్యాన్ని తెలియచేయటానికి నువ్వు అర్ధనారీశ్వర శరీరము ధరించావు. ఈ మూడు లోకాలు నీ శరీరంగా ఉన్నాయి.**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 101**

**శ్లోకం**

**నిర్మాసి సంహరసి నిర్వహసిత్రిలోకీం**

**వృత్తాంతమేతమపి వేత్తినవామహేశః**

**తస్యేశ్వరస్య గిరిజే తవ సాహచర్యా-**

**జ్జాతః శ్రుతిష్వపి జగజ్జనకత్వవాదః**

**.. 101 ..**

**ప్రతిపదార్థం**

**గిరిజే = హిమవంతుని కూతురా! (తల్లీ! మీనాక్షీ), త్రిలోకీం = మూడు లోకములను, నిర్మాసి = నువ్వు నిర్మిస్తున్నావు, సంహరసి = నశింపచేస్తున్నావు, నిర్వహసి = నిర్వహిస్తున్నావు, ఏతం వృత్తాంతం అపి = ఈ వృత్తాంతము అంతా కూడా (సృష్టి, స్థితి, సంహార వృత్తాంతము), మహేశః = శివునికి, వేత్తి వా నవా = తెలుసా? తెలియదా? తస్య ఈశ్వరస్య = ఆ ఈశ్వరునికి, తవ సాహచర్యాత్ = నీ సాహచర్యము వల్ల, శ్రుతిషు అపి = వేదములందు కూడా, జగత్ జనకత్వవాదః = సృష్టికర్త అనే మాట, జాతః = పుట్టింది.**

**తాత్పర్యం**

తల్లీ! మీనాక్షీ! మూడు లోకములను నువ్వు సృష్టిస్తున్నావు, నశింపచేస్తున్నావు, నిర్వహిస్తున్నావు. ఈ వృత్తాంతము అంతా కూడా (సృష్టి, స్థితి, సంహార వృత్తాంతము) శివునికి తెలుసా? తెలియదా? ఆ ఈశ్వరునికి నీ సాహచర్యము వల్ల వేదములందు సృష్టికర్త అనే మాట పుట్టింది.

విశేషాలు

అమ్మయొక్క ఆధిక్యాన్ని తెలియచేయటానికి చేసిన చమత్కారము ఈ శ్లోకంలో ఉన్నది.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 102

శ్లోకం

సత్తాస్యఖండసుఖసంవిదసిత్రిలోకీ-

సర్గస్థితిప్రతిహతిష్వపినిర్వ్యపేక్షా

త్వామంతరేణ శివఇత్యవశిష్యతే కి-

మర్ధంశివస్య భవతీత్యనభిజ్ఞవాదః

.. 102 ..

ప్రతిపదార్థం

సత్తా అసి = విశ్వవ్యాప్త ఉనికివి అయి ఉన్నావు. అఖండసుఖసంవిత్ అసి = సచ్చిదానంద స్వరూపమయి ఉన్నావు, త్రిలోకీసర్గస్థితిప్రతిహతిషు అపి = సృష్టి, స్థితి, సంహారం అనే మూడు గుణాలకు కూడా, నిర్వ్యపేక్షా = ఇతరులనుండి ఎటువంటి సహాయం ఆశించవు, త్వాం అంతరేణ = మీ మధ్య, శివః ఇతి = శివుడను, అవశిష్యతే కిమ్ = ఏదైనా మిగిలి ఉందా? శివస్య అర్ధం భవతి ఇతి = నువ్వు శివునిలో సగం అని, అనభిజ్ఞవాదః = తెలియనివారు చెబుతుంటారు.

తాత్పర్యం

తల్లీ! మీనాక్షీ! సచ్చిదానంద స్వరూపం నీది. సృష్టి, స్థితి, సంహారం అనే మూడు గుణాలకు నువ్వు మూర్తివి. నువ్వు లేకుండా శివుడు లేడు. ఇది తెలియనివారు నువ్వు శివునిలో సగం అని అంటారు.

విశేషాలు

సత్ + చిత్ + ఆనందం. సత్యం, జ్ఞానం, ఆనందం కలిసి పరమాత్మ స్వరూపం. భూత, భవిష్యత్, వర్తమానాల వల్ల మార్పుచెందనిదీ, ఎప్పుడూ ఒకేవిధంగా ఉండేదీ సత్/సత్తు. సచ్చిదానందంలో రెండవదైన చిత్/చిత్తు అంటే ఎరుక. నిరుపాధికం, నిరతిశయం, నిరుపమానం అయి ఎప్పటికీ ఉండే సుఖానుభూతి ఆనందం. దీపానికి ఎరుపు తెలుపుల

మిశ్రమవర్ణం, వేడి, కాంతి ఎలా స్వాభావికంగా కలిసి ఉంటాయో అలా సత్తు, చిత్తు, ఆనందం మిళితమై ఉంటాయి. అవి అభిన్నం. మీనాక్షీదేవి సచ్చిదానంద స్వరూపమని కవి భావన.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 103

శ్లోకం

నాస్మిన్ రవిస్తపతినాత్ర వివాతి వాతో

నాస్య ప్రవృత్తిమపి వేద జగత్సమస్తం

అంతఃపురంతదిదమీదృశమంతకారే-

రస్మాదృశాస్తు సుఖమత్ర చరంతి బాలాః

.. 103 ..

ప్రతిపదార్థం

అస్మిన్ = ఇక్కడ, రవిః న తపతి = సూర్యుడు ప్రకాశించడు. అత్ర వాతః న వివాతి = ఇక్కడ గాలి వీయదు. అస్య ప్రవృత్తిం అపి = దీని స్వభావం ఏమిటో, సమస్తం జగత్ న వేద = సమస్త ప్రపంచానికి ఏమీ తెలియదు. తత్ ఇదం = అటువంటి ఈ, అంతకారేః అంతఃపురం = శివునియొక్క మృత్యువుకు సంబంధించిన అంతఃపురము, ఈదృశం = ఇటువంటిది. అస్మాదృశాః బాలాః తు = మా వంటి పిల్లలు, అత్ర = ఈ మృత్యువు యొక్క అంతఃపురంలో, సుఖం = సుఖంగా, స్వేచ్ఛగా, చరంతి = తిరుగుతుంటారు.

తాత్పర్యం

అక్కడ సూర్యుడు ప్రకాశించడు. అక్కడ గాలి వీయదు. ప్రపంచానికి దాని గురించి ఏమీ తెలియదు. అది శివునియొక్క మృత్యువుకు సంబంధించిన అంతఃపురం. కానీ ఇక్కడ మాతరహా పిల్లలు (తల్లి మీనాక్షిని సేవించే భక్తులు) స్వేచ్ఛగా తిరుగుతారు. (అనగా అమ్మవారి భక్తులకు మృత్యుభయం ఉండదని భావం).

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 104

శ్లోకం

త్వత్సన్నిధానరహితో మమ మాస్తు దేశ-

స్త్వత్తత్త్వబోధరహితా మమ మాస్తు విద్యా

**త్వత్పాదభక్తిరహితో మమ మాస్తు వంశ-**

**స్త్వచ్చింతయా విరహితం మమ మాస్తు చాయుః**

**.. 104 ..**

**ప్రతిపదార్థం**

**త్వత్సన్నిధానరహితః దేశః = నీయొక్క సన్నిధానము (సమీపము; ఆశ్రయము) లేని దేశము, మమ మా అస్తు = నాకు వద్దు. త్వత్తత్త్వబోధరహితా విద్యా = నీ తత్త్వాన్ని బోధించని విద్య, మమ మా అస్తు = నాకు వద్దు. త్వత్ పాదభక్తిరహితః వంశః = నీ పాదముల పట్ల భక్తిలేని వంశము, మమ మా అస్తు = నాకు వద్దు. త్వత్ చింతయా విరహితం ఆయుః చ = నీ చింతన (తలంపు; పలుమాఱు తలచుట) లేని జీవితకాలము కూడా, మమ మా అస్తు = నాకు వద్దు.**

**తాత్పర్యం**

**తల్లీ! మీనాక్షీ! నీయొక్క ఆశ్రయము లేని దేశము నాకు వద్దు. నీ తత్త్వాన్ని బోధించని విద్య నాకు వద్దు. నీ పాదముల పట్ల భక్తిలేని వంశము నాకు వద్దు. నీ తలపులేని జీవితకాలము కూడా నాకు వద్దు.**

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 105**

**శ్లోకం**

**త్వందేవి యాదృగసితాదృగసిత్వమీదృ-**

**గేషేతి వక్తుమివ బోద్ధుమపి క్షమః కః**

**మామేవ తావదవిదన్నతిపామరోఽహం**

**మాతః స్తుతింత్వయి సమర్పయితుం విలజ్జే**

**.. 105 ..**

**ప్రతిపదార్థం**

**దేవి = దేవీ! (అనేక విధములుగా ఆడుదానా! దుర్గా! అభిషేకింపబడ్డ రాణీ!), మాతః = తల్లీ! మీనాక్షీ!, త్వం యాదృక్ అసి = నువ్వు ఎటువంటిదానివి అయి ఉన్నావో, తాదృక్ అసి = ఆ విధముగా ఉన్నావు. త్వం ఈదృక్ = నువ్వు ఇటువంటిదానివని, ఏషా ఇతి = ఈమెలాంటిదానివని, వక్తుం ఇవ = చెప్పటకు కూడా, బోద్ధుం అపి = తెలియుటకు కూడా, కః క్షమః = ఎవడు సమర్థుడు? మాం ఏవ = నేను కూడా, తావత్ = అటువంటివాడినై, అవిదన్ = తెలియనివాడినై, అతిపామరః అహం = అతి**

నీచుడనయినప్పటికీ (ఏమాత్రం తెలివిలేనివాడినయినప్పటికీ), త్వయి = నీయందు (నీకు), స్తుతిం సమర్పయితుం = ఈ ఆనందసాగరమను స్తవమును అంకితము చేయుటకు, విలజ్జే = బాగా సిగ్గుపడుచున్నాను.

తాత్పర్యం

తల్లీ! మీనాక్షీ! నువ్వు ఎటువంటిదానివి అయి ఉన్నావో ఆ విధముగా ఉన్నావు. (వర్ణనాతీతురాలివని భావం) నువ్వు ఇటువంటిదానివని చెప్పుటకు, తెలియుటకు కూడా ఎవడు సమర్థుడు? (ఎవరూ సమర్థులు కారని భావం). నేను కూడా నీ గురించి ఏమాత్రం తెలివిలేనివాడినయినప్పటికీ నేను నీకు ఈ ఆనందసాగరమను స్తవమును అంకితము చేయుటకు, బాగా సిగ్గుపడుచున్నాను.

విశేషాలు

దీక్షితులవారి వినయము ఈ శ్లోకంలో మనకు కనబడుతుంది.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 106

శ్లోకం

కాచిత్కృతాకృతిరితిత్వయిసాఽర్పితేతి

కాపిప్రమోదకణికానమమాంతరంగే

మౌఢ్యంమదీయమిహయద్విదితంమమైవ

కింత్వంబవిశ్వసిమిదీనశరణ్యతాంతే

.. 106 ..

ప్రతిపదార్థం

అంబ = తల్లీ! మీనాక్షీ!, కాచిత్ కృతిః కృతా ఇతి = ఒకానొక కృతి (నాచేత) రచింపబడినది అని, సా త్వయి అర్పితా ఇతి = ఆ కృతి నీకు అర్పింపబడినది అని, మమ అంతరంగే = నా మనస్సులో, కాపి ప్రమోదకణికా న = కొంచెంపాటి ఆనందలేశము లేదు. ఇహ = ఈ ఆనందసాగర స్తవరచనలో, మదీయం యత్ మౌఢ్యం = నాకు సంబంధించిన ఏ మూర్ఖత్వము (అజ్ఞానము) ఉన్నదో, మమ ఏవ విదితం = నాకు బాగా తెలిసింది. కింతు = కాని, తే దీనశరణ్యతాం = దీనులను రక్షించే నీ గుణాన్ని, విశ్వసిమి = విశ్వసిస్తున్నాను.

తాత్పర్యం

తల్లీ! మీనాక్షీ! ఒకానొక కృతి నాచే రచింపబడినది అని, ఆ కృతి నీకు అర్పింపబడినది అని నా మనస్సులో కొంచెంపాటి ఆనందలేశము లేదు. ఈ ఆనందసాగర స్తవరచనలో నాకు సంబంధించిన అజ్ఞానము నాకు బాగా తెలిసింది. కాని దీనులను రక్షించే నీ గుణాన్ని ఈ కృతి రచనలో నేను విశ్వసిస్తున్నాను.

---

శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 107

శ్లోకం

కాలానపాస్యవిషువాయనసంక్రమాదీ-

నస్తంగతేహిమకరేచదివాకరేచ

అంబస్మరేయమపితేచరణారవింద-

మానందలక్షణమపాస్తసమస్తభేదం

.. 107 ..

ప్రతిపదార్థం

అంబ = తల్లీ! మీనాక్షీ!, విషువ, అయన, సంక్రమ ఆదీన్ కాలాన్ అపాస్య = రాత్రిపగలు సమమగు దినము, సూర్యుని దక్షిణోత్తర దిశల పోక (అయనములు - ఉత్తరాయనము, దక్షిణాయనము), రాశుల సంక్రమణము మొదలయిన వాటితో కూడిన కాలమును విడిచిపెట్టి, హిమకరే చ = చంద్రుడునూ, దివాకరే చ = సూర్యుడును, అస్తంగతే = అస్తమయము పొందిన సమయంలో, ఆనందలక్షణం = ఆనంద లక్షణములతో కూడిన, అపాస్తసమస్తభేదం = అన్ని భేదాలను తొలగించే, తే చరణారవిందం అపి = నీ కమల పాదాలను, స్మరేయం = స్మరిస్తానా?

తాత్పర్యం

తల్లీ! మీనాక్షీ! రాత్రిపగలు సమమగు దినము, ఉత్తరాయణము, దక్షిణాయనము, రాశుల సంక్రమణము మొదలయిన వాటితో కూడిన కాలమును విడిచిపెట్టి, చంద్రుడునూ, సూర్యుడును, అస్తమయము పొందిన సమయంలో, ఆనంద లక్షణములతో కూడిన అన్ని భేదాలను తొలగించే నీ కమల పాదాలను, స్మరిస్తానా? (అనగా కాలాతీతంగా అమ్మయొక్క పాదారవిందాలను స్మరించాలని, ఆ భాగ్యాన్ని అమ్మవారు అనుగ్రహించాలని భావం.)

విశేషాలు

భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుడి చుట్టూ ప్రదక్షిణలు చేయడంలో సంవత్సరంలో ఆరు నెలలు భూమధ్యరేఖకు ఉత్తరంవైపు, ఆరు నెలలు దక్షిణ దిశకు మళ్ళినట్టు కనిపిస్తుంది. ఉత్తరంవైపు ఒరిగినప్పుడు ఉత్తరాయణమని, దక్షిణంవైపు

మళ్ళినప్పుడు దక్షిణాయనమని అంటారు. సూర్యుడు మకరరాశిలో ప్రవేశించినది మొదలు ఆరు నెలలు ఉత్తరాయణం. తరువాత ఆరు నెలలు దక్షిణాయనం. ఉత్తరాయణం పుణ్యకాలమని విశ్వాసం.

---

**శ్రీనీలకంఠదీక్షితుల ఆనందసాగరస్తవము - 108**

**శ్లోకం**

**కలహంసవ్యంజనం జగన్మాతుః**

**అపరబ్రహ్మమయం వపురంతః**

**శశిఖండమండనముపాసే**

**.. 108 ..**

**ప్రతిపదార్థం**

**చతురధ్యాయీరూపం = బ్రహ్మసూత్ర స్వరూపము, కలహంసవ్యంజనం = మధురధ్వని చేయు రాజహంస గుర్తు కలిగినది (హంస వాహనంగా కలిగినది), అపరబ్రహ్మమయం = దానికంటే తరువాతలేని బ్రహ్మ స్వరూపము, శశిఖండమండనం = చంద్రకళ ఆభరణంగా కలిగినది అయిన, జగన్మాతుః వపుః = జగత్తుల తల్లియొక్క శుభాకారాన్ని, అంతః ఉపాసే = హృదయపూర్వకంగా ధ్యానిస్తాను.**

**తాత్పర్యం**

**బ్రహ్మసూత్ర స్వరూపిణి, హంస వాహన, దానికంటే తరువాతలేని అపరబ్రహ్మ స్వరూపిణి, చంద్రకళాభరణ అయిన లోకములన్నింటికి తల్లి అయిన మీనాక్షీదేవి శుభాకారాన్ని హృదయపూర్వకంగా ధ్యానిస్తాను.**

**విశేషాలు**

**శ్లోకంలోని "హంస" మరియు "చంద్ర" అనే పదాలు వైరాగ్యము మరియు జ్ఞానాన్ని సూచిస్తాయి.**

---

**ఆచార్య తాడేపల్లి పతంజలి గారి వివరణతో శ్రీనీలకంఠదీక్షిత విరచితమయిన శ్రీ ఆనందసాగరస్తవము సంపూర్ణమయినది.**

**అమ్మదయతో ఆచార్యతాడేపల్లిపతంజలి తెలుగులోకిఅనువదించిన శ్రీఆనందసాగరస్తవముయొక్కప్రతిపదార్థతాత్పర్యవిశేషాలు02-01-23 ముక్కోటిఏకాదశిన ప్రారంభమయి, 25-06-23 తేదీన పూర్తయ్యాయి.**